ఆయుర్వేద శిక్ష

చతుర్థ స్కంధము

# 3. వనౌషధ విజ్ఞానము

## మొదటి భాగము



సంపాదకులు:
భిషగ్రత్న ఆచంట లక్ష్మీపతిగారు,
బి.ఏ., యం. బి. సి. యం.

1945

ము ద్రి ణ ము :
శ్రీ ధన్వంతరీ ముద్రాక్షరశాల
డా॥ భిషగ్రత్న ఆచంట లక్ష్మీపతిగారు,
బి. ఏ., యం. బి. సి. యం.
బె జ వా డ.

గ్రంథ ములకు :
సంపాదకుల పేర - సర్కసు మైదానము,
గవర్నరుపేట, బెజవాడకు వ్రాయవలెను.

చందాదార్లకు రు. 5_0_0
పోస్టేజి సహా.

ఇతరులకు రు. 6_4_0
పోస్టేజి గాక.

# సంపాదకీయ ప్రస్తావన

---

ఆయుర్వేదమునందుపయోగింప బడిన ఔషధముల గూర్చి ఔషధస్థానమను ఒకటే సంపుటమునందు వివరింప దలచితిమి గాని విషయ బాహుళ్యముచే నీగ్రంథము నాలుగు సంపుటములు చేయవలసి వచ్చెను. అందును వనౌషధ విజ్ఞానమునుగూడ నొక సంపుటములో ముగించ లేకపోయినాము. ఇంతకును అసంఖ్యాకములగు మూలికలలో మేము వివరింప బ్రయత్నించినవి నూటయేబది మాత్రమే. అందు అకారాది గా 'అంకోటము' మొదలు 'గోక్షురము' వరకు 74 వనౌషధులు మాత్రము ఈ వనౌషధవిజ్ఞానము యొక్క మొదటి భాగము నందు ముగింప గల్గితిమి.

చందాదారుల సౌకర్యార్థమై రమారమి 500 పుటల గ్రంథము నొక సంపుటముగా ప్రచురించుటకు మేము నిశ్చయించినందున ప్రస్తుతమీ సంపుటమును మీ కందజేయు చున్నాము. ఇట్టిగ్రంథము ఆంధ్రభాష యందిదివరకు ప్రచురింపబడి యుండలేదు. ఇందు శ్రీ ఆయుర్వేదాచార్య ఇంద్రగంటి వెంకటేశ్వరశర్మగారు బహుకాలము కృషిచేసి సిద్ధపర చిన విజ్ఞానమంతయు చేరి యుండుటయేగాక అచ్చటచ్చట నా స్వానుభవము గూడ సులభమైన భాషలో క్లుప్తముగా చేర్చబడియున్నది. శ్రీ శర్మగారికి మా కృతజ్ఞతను హృదయ పూర్వకముగా తెల్పుచున్నాము.

అకారాది విషయసూచికను అనేక శ్రమల కోర్చి తయారు చేసియిచ్చిన శ్రీ ఆయుర్వేదభిషక్ లక్కోజు సాంబశివరావు గారికి మేము కృతజ్ఞులము.

ఆంధ్ర దేశమునందు ఆయుర్వేదవైద్యులును ఆయుర్వేదాభిమానులును ఈ గ్రంథము నాదరించి మమ్ములను కృతార్థుల జేయుదురుగాక.

సర్కసుమైదానము,
గవర్నరుపేట,
బెజవాడ,
1—3—45.

ఆచంట లక్ష్మీపతి,
ఆయుర్వేద శిక్షా
సంపాదకులు.

# విషయసూచిక

## ఆయుర్వేదనిక్షు—ఔషధస్థానము

### చతుర్థ స్కంధము

### వనౌషధ విజ్ఞానము

# ఆయుర్వేద శిక్ష

(A Text-book of Ayurveda)

తృతీయ సంపుటము

## ఔషధస్థానము

---

## 3 వ భాగము
## వనౌషధవిజ్ఞానము

---

# 1

## అంకోట (లః) ఊడుగచెట్టు.

---

భాషాంతర నామములు

హిందీ—అంకోట (ల) ఢేరా, మరాఠి—అంక్లోల, గుజరాతి—అంక్లోల, మలయాళం—అజింజిల్, కర్ణాటకం—అంకలే, ద్రావిడం—అజిసిల్.

నైసర్గిక స్వరూపవర్ణనము.

Natural Order : అంకోలకుటుంబము:—(Cornaceae)

అంకోల : (Alangium Lamarkii)

1915 వ సం॥ లషింగ్టన్ రచించిన వృక్షముల పట్టికలో 2 వ వాల్యూమ్‌లో 1420 వ నెంబరు లో (ఊడుగ్రై) ఊడుగ Alangium Lamarkii అని వర్ణింపబడి యున్నది. ఇది కారినేషియే వర్గములోనిది. సంస్కృతమున అంకోలమునకు సరిపోవుచున్నది.

దీనికి ఇంగ్లీషులో కార్నెల్, లేక డాగ్‌వుడ్ (Cornel or Dog wood) కుటుంబమనిపేరు. ఈ కుటుంబములోని చెట్లు బిర్రిటనులో 8 లేక 9 అడుగులు పెరుగుచు అండాకృతి గలిగి సూదివంటి కొనను గలిగి రెండు (2) అంగుళముల పొడవు, ఒకటిన్నర 1.5 అంగుళముల వెడల్పుగల ఆకులను గలిగియుండును. ఇవి యాకురాలు కాలమున యెఱ్ఱబడును. పుష్పములు తళుకులేని తెలుపురంగు. మధ్యారంభమంజరి. పండ్లు నలుపుఊదా, చేదు, ఒకటేగింజ, చమురుగలదు. కట్టెగట్టిది. ఈ కార్నేషియాలో నాలుగైదు రకములు గలవు. హిందూదేశమున నిది మధ్యరకము ఎత్తుగలది. రోమములుండును. చిన్నవృక్షము 20 అడుగులలోపు ఎత్తు. ఆకు ఒకటిన్నర (1.5) మొదలు 3 అంగుళముల పొడవుండును దక్షిణహిందూస్థానము సందంతటను పెరుగును.

లషింగ్టన్ పట్టీలో 2633 నెంబరున పేర్కొనబడిన ఊడుగ Aluritea Moluccana అనునది సంస్కృతమున అంకోలమునకు సరిపడలేదు. ఆముదము కుటుంబములోనిది. ఇది పై దేశమునుండి వచ్చినదాపతు.

## పర్యాయ పదములు

శ్లో॥ అంకోటో దీర్ఘకీలః స్యాత్ అంకోలశ్చ నికోచకః॥

అంకోటము, దీర్ఘకీలము, అంకోలము, నికోచకము అనునవి యంకోట నామములు.

## అంకోట గుణములు

శ్లో॥ అంకోటకః కటుస్తీక్ష్ణః స్నిగ్ధోష్ణస్తువరోలఘుః।
రేచనః కృమిశూలామశోథ గ్రహవిషాపహః॥
విసర్ప కఫపిత్తాస్రి మూషికాహివిషాపహః॥

ఊడుగ కటురసమును, కషాయానురసమును, తీక్ష్ణస్నిగ్ధలఘుగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. మలరేచనమును జేయును. కఫపిత్తములను శమింపజేయును. క్రిమి, శూల, ఆమశోథ, గ్రహదోషము, విషము, విసర్పము, రక్తదోషము, మూషికావిషము, సర్పవిషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## అంకోటఫలగుణములు

శ్లో॥ తత్ఫలం శీతలం స్వాదుశ్లేష్మఘ్నం బృంహణంగురు।
బల్యం విరేచనం వాతపిత్త దాహక్షయాస్రజిత్॥

ఊడుగపండు మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. బృంహణము, బలమును గలిగించును. మలరేచనమును జేయును.

త్రిదోషములను శమింపజేయును. దాహమును, క్షయమును, రక్తదోషమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—

దీర్ఘకీలము, (పీతసారము, తామ్రఫలము, గంధపుష్పము, కోటరము, లంబకర్ణ, గుప్తస్నేహా) *

(ఖ) గుణబోధకములు:—

(రేచి, విషఘ్నము, వామక.)

(2) శబ్దార్థములు:—

దీర్ఘకీలము—పొడవుగనుండు ముండ్లను గలది. పీతసారము—పసుపు పచ్చని సారమును గలది. తామ్రఫలము—ఎఱ్ఱగనుండు ఫలములను గలది. గంధపుష్పము—పరిమళించు పుష్పములను గలది. కోటరము—తొఱ్ఱలతో గూడిన మ్రానుగలది. లంబకర్ణ—వ్రేలాడుచుండు కర్ణములవంటి పత్రములను గలది. గుప్తస్నేహా—తైలముతో గూడిన బీజములను గలది. రేచి—మలరేచనమును జేయునది. విషఘ్నము—విషమును బోగొట్టునది. వామక—వాంతిని గలిగించునది.

(3) పరిచయబోధక లక్షణము:— ♦

"అంకోలో ఽంగులిపత్రః స్యాత్ పాదపోదృఢమూలకః।
శుభ్రపుష్పః తామ్రఫలః కంటకీ వనవాసకః"॥

ఊడుగచెట్టు దృఢముగనుండు మూలభాగమును గలిగి యొక్కొక్క యంగుళము పొడవుగనుండు పత్రములతో గూడియుండును. దీనికి దృఢముగను పొడవుగను నుండు ముండ్లుండును. దీని పుష్పములు తెల్లగను ఫలములు ఎఱ్ఱగను నుండును. ఈ వృక్షము అడవులం దుత్పత్తి యగుచుండును. శ—వ.

* బ్రాకెట్టులోని పర్యాయ పదములు ఇతర నిఘంటువులలోనివి.

♦ ఇది యెత్తుగ బెరుగు వృక్షజాతులలో గణింపబడు చున్నది. దీని బీజములను సర్పవృశ్చికాది విషములం దుపయోగించుచుందురు. దీని మూలమును పారదశోధనకై యుపయోగింతురు.

(4) విశేషగుణములు:—

(క) వాతమును శమింపజేయును. వృశ్చికవిషమును బోగొట్టును. ధ-ని., తిక్తానురసమును, రూక్షసరగుణములను గలిగియుండును. ని—ర.

(ఖ) అంకోలరసము—వాంతిని గలిగించును. త్రిదోషములను శమింప జేయును. విషము, శూల, శోఫ, క్రిమి, గ్రహదోషము, ఆమదోషము, రక్త దోషము, విసర్పము, అలర్క విషము, మూషికవిషము, కటిశూల, అతి సారము వీనిని బోగొట్టును. ని—ర.

(గ) ఫలము—మలబంధమును, అగ్నిమాంద్యమును గలిగించును. శ్లేష్మ మును వృద్ధిపొందించును. చ-సూ-అ-26.

(ఘ) తైలము—అభ్యంగముచేసిన కఫవాతములను శమింపజేయును. చర్మవ్యాధులను బోగొట్టును. వై—ని.

(చ) బీజము—మధురరసమును, గురుస్నిగ్ధసరగుణములను శీతవీర్యమును మధురవిపాకమును గలిగియుండును. ధాతువులను వృద్ధిపొందించును. అగ్ని మాంద్యమును గలిగించును. బలమును గలిగించును. వెంటనే శుక్రమును గలి గించును. కఫమును వృద్ధిపొందించును. వాతపిత్తములను శమింపజేయును. దాహమును, క్షయమును, రక్తదోషమును, విసర్పమును బోగొట్టును. ని—ర

(5) ప్రయోగములు:—

1. దన్తకాష్ఠగత విషమునందు అంకోట ప్రయోగము.

"అథ వాంకోటమూలాని"

ఊడుగవేరును దంతములతో నమిలి దంతములను తోమినచో దన్త కాష్ఠగత విషమువలన గలిగిన వికారములు శమించును. సు-క-అ-1.

2. అంజనము విషసంస్పృష్టమైనప్పుడు అంకోలప్రయోగము.

"ఏకైకం కారయేత్పుష్పం బధ్నా కొంకోటయోరపి"

మంకెనపువ్వును, ఊడుగపువ్వును నూరి రసమును గ్రహించి నేత్ర ముల కంజనము వేసిన విషసంస్పృష్టాంజనమువలన గలిగిన వికారములు శమించును. సు-క-అ-1.

3. ఆఖువిషమునందు అంకోల ప్రయోగము.

"అంకోలమూల కల్కోవా బస్తమూత్రేణ కల్కితః ।
పానలేపన యోర్యుక్తః సర్వాఖు విషనాశనః"

ఊడుగవేరును మేకమూత్రముతో నూరి పానముగను లేపముగను ఉపయోగించిన సమస్త మూషికవిషములు శమించును. వా-ఉ-అ-38.

4. అలర్కవిషమునందు అంకోలప్రయోగము.

"క్షీరేణపరిపేషితా ।
అంకోలవంశజావాపి శ్వవిషఘ్నీ ప్రయత్నతః" ॥

ఊడుగపట్టను పాలతో నూరి సేవించిన పిచ్చికుక్కవిషము శమించును. భా-ప్ర.

5. అతీసారమునందు అంకోలప్రయోగము.

"తండులజలపిష్టాంకోలమూలకర్షార్ధపానమపహరతి ।
సర్వాతీసారగ్రహణీరోగసమూహం మహాఘోరం"

ఊడుగవేరును బియ్యపుకడుగులో నూరి యర్ధకర్షము సేవించిన సమస్త అతీసారములును గ్రహణీరోగమును శమించును. చ-ద.

6. గరవిషమునందు అంకోలప్రయోగము.

"అంకోల మూలనిఃక్వాథం ఫాణితం సఘృతం పిబేత్ ।
తైలాక్తః స్విన్నసర్వాంగో గరదోషవిషాపహః"

ఊడుగవేళ్ళ కషాయమును తిరిగి చిక్కపడువరకును గాచి యందు తేనెనుజేర్చి, తైలముతో ముందుగ నభ్యంగము జేసికొని, స్వేదకర్మనుగూడజేసికొని పిమ్మట సేవించిన గరవిషమువలన గలిగినవికారములు శమించును. చ-ద.

7. మత్స్యవిషమునందు అంకోలప్రయోగము.

"అంకోల వృక్షదలధూప విధానయోగాత్
నాశం ప్రయాతి విషమాశునరస్య మాత్స్యం
ధూపః పునః పునః కటుతైల స్నుకేశసక్తు
ప్రోఽస్య దంశపదకే సుతరాం ప్రశస్తః"

ఊడుగాకులు, ఆవనూనె, తలవెంట్రుకలు, పేలాలు వీనిని ధూపవిధానము ననుసరించి పలుమార్లు దంశముజాటునందు ధూపము వేసిన మత్స్యవిషము శమించును. గ-ని.

8. వీర్యస్తంభనమునకై యంకోలప్రయోగము.

"వసమంకోల తైలేన నాభిలేపోఽపి వీర్యధృక్"

ఊడుగగింజల తైలమును నాభియందు లేపనము జేసికొనిన సంభోగము నందు శుక్రము శీఘ్రముగ స్ఖలనముగాక స్తంభించును. ర-ర.

(6) యోగములు:—

1. అంకోలాదిచూర్ణము—బ-రా-శ్లేష్మరోగ. మాత్ర—¼ తులం.
ఉపయోగములు:—శ్వాసరోగము శమించును.

2. అంకోలవటకము—భా-ప్ర-అతిసార. మాత్ర—1 అక్షప్రమాణం.
ఉపయోగము—రక్తాతిసారము శమించును.

## (7). Actions and uses:—

Mr. Mohdin Sherrif has drawn attention to the emetic properties of the bark in the "Pharmacopæia of India". He says—"It has proved i self an efficient and safe emetic in doses of fifty grains; in smaller doses it is nausea t and febrifuge. The bark is very bitter and its repute in skin diseases is not without foundation. If it is continued for a sufficient period its influence over them is greater than that of colotropis gigantea". Mr. Mohdin Sherrif, in a further report upon this drug (1883), states—'It is a good substitute for Ipecacuanha and proves useful in all diseases, in which the latter is indicated except dysentry. As a diaphoretic and antipyretic it has been found useful in relieving pyrexia. Dose as a nauseant, diurtlic and febrifuge, 6 to 10 grains of the root bark; as an alterative, 2 to 5 grains. It is given in leprosy ana Syphilis; the natives consider it to be alexiteric, espicially in cases of bites from rabid animals."—
(Pharmacographia Indica by W. Dymook, Part II, P. 165).

## స్వానుభవము

ఊడుగుచెట్టు యొక్క పట్టచూర్ణమును సమభాగము బెల్లముతో గచ్చకాయంత మాత్రలుచేసి 3 మాత్రలు గరిషము (పెట్టుమందు), అనుమానము గలచోట నిచ్చుట సాంప్రదాయము ఈ మాత్రలు మ్రింగునపుడు రోగి బొడ్డులోతు

నీళ్లలో మునిగి స్నానముచేసి నీళ్ళలోనే నిలువబడి 3 మాత్రలు మ్రింగవలయును. వాంతియయిన కావచ్చును.

ఎలుక కఱచి రక్తము దుష్టమయిన రోగులకు (ఆఖువిషం) గూడదీని నీయవచ్చును. నేనీ ప్రతికారమిచ్చియున్నాను. 3 మోతాదులకంటె హెచ్చునిచ్చు వాడుకలేదు. 5 గ్రైనుల మోతాదులు దినమునకు 3 చొప్పున విశేషకాలమీయవచ్చును.

ఇతర వ్యాధులలో నీ మూలిక నిచ్చు అనుభవము నాకులేదు. (ఆ. ల.)

# 2

## అగరు - అగరుకట్టె.

### భాషాంతర నామములు

హిందీ—అగర్, మరాఠీ—అగర్, గుజరాతీ—అగర్, మలయాళం—అకిల్, కర్ణాటకం—అగరు, ద్రావిడం—అగిల్.

### నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural order :** అగరుకుటుంబము:—**Thymelocaceae.**

అగరు:—**Aquilaria agallocha.**

అగరుచెట్టు కొండలమీద పెరుగును. లేఁగొమ్మలమీద బట్టువంటి రోమములు గలవు.

ఆకులు—ఒంటరిచేరిక-లఘుపత్రములు బల్లెపాకారము. పొ॥ $2\frac{1}{2}$'' అం. $3\frac{1}{2}$''; అం. విషమరేఖ పత్రము-సమాంచలము. కొనవాలముగలదు.

పుష్పమంజరి—రెమ్మగుత్తి. తెలుపు- ఏకలింగపుష్పములు.

పుష్పనిచోళము—సంయుక్తము-5 తమ్మెలు అల్లుకొని యుండును. నీచము-

కింజల్కములు—10. కాడలు మిక్కిలిపొట్టివి. పుప్పొడితిత్తులు వెడల్పుగానుండును. కింజల్కములకు లైన 6 పొలుసులుగలవు.

స్త్రీ పుష్పము:—పుష్పనిచోళము—పైదానివలెనే యుండును.

అండాశయము, అండకోశము, ఉచ్చము, రెండుగదులు-కీలము మిక్కిలి పొట్టి-గింజలు వ్రేలాడుచుండును.

తత్కుటుంబపు చెట్లువిస్తారము శీతల దేశములలో బెరుగును. ఆకులు ఒంటరిచేరిగానైనను, అభిముఖ చేరికగానైననుండును. లఘుపత్రములు. సమాంచలము, పుష్పనిచోళమే గలదు. ఏకలింగ పుష్పములు. అండాశయము గదిలో నొక్కొక గింజయే యుండును.

అగరుచెట్టు కాశ్మీరదేశ ప్రాంతములం గొండలమీద సాధారణముగ నఱువది యడుగుల యెత్తుపెరుగును. దాని మ్రానుయొక్క కైవారము 5 మొ॥ 8 అడుగుల వఱకునుండును. ఇఱువదేండ్ల వృక్షమైన పిదప అగరు కొఱకు దానిని నఱుకవచ్చు నందురు గాని కొందరు మంచి యగరేబదిసంవత్సరములలోపున రాదందురు. ఎన్నిసంవత్సరములు (నఱికియుంచినను) నఱుకక యుంచినను నన్నిచెట్ల యందు నగరు లభించదు. కొన్నిచెట్లయందు మాత్రము మ్రానులోను గొమ్మలయందును ముక్క ముక్కలవలె నగరేర్పడును. ఏకారణములవల్ల నిట్లేర్పడుచున్నదో తెలియ వచ్చుటలేదు. మఱియు నేచెట్టునందేర్పడినది నఱికినగాని తెలియదు. అగరులేని చెట్లంత నుపయోగ కారులుగావు. కలపకు సువాసన యుండక తేలికగనుండును. అగరునకు మంచిపరిమళము గలదు. వస్నీరువలె దీనిని శుభకార్యము లందుపయోగింతుము. దీనితోడనే అగరువత్తులను జేయుదురు. కాని ఇతరపరిమళ ద్రవ్యములతో గూడ వత్తులుచేసి వానినే అగరువత్తులని యమ్ముచున్నారు. సాధారణముగా సంగళ్ళ యందుండు ఆగరునూనెయు నిజముగా నగరునుండి చేసినదేయని నమ్ముటకు వీలులేదు. కాగితములు చేయక పూర్వము అగరు బెరడులను బలుచగ జీల్చి వానిమీద గొందఱు వ్రాసెడు వారు.

## పర్యాయ పదములు

శ్లో॥ అగరుప్రవరం లోహం రాజార్హం యోగజంతథా ।
వశికం కృమిజంచాపి కృమిజగ్ధమనార్యకం॥

అగరు, ప్రవరము, లోహము, రాజార్హము, యోగజము, వశికము, కృమిజము, కృమిజగ్ధము, అనార్యకము అనునవి యగరునామములు.

## అ గ రు గు ణ ము లు

శ్లో॥ అగరూష్ణం కటుత్వచ్యం తిక్తం తీక్ష్ణంచ పిత్తలం ।
లఘుకర్ణాక్షిరోగఘ్నం శీతవాతకఫప్రణుత్॥

అగరుకట్టె కటురసమును, తిక్తానురసమును, తీక్ష్ణలఘు పిచ్ఛిలగుణములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. చర్మమునకు హితమైనది. పిత్తమును వృద్ధిబొందించును. వాతకఫములను శమింపజేయును. కర్ణరోగము, నేత్రరోగము, శైత్యము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు—

లోహము, రాజార్హము, కృమిజగ్ధము, (కాకతుండ, ధూపార్హా, మిశ్రవర్ణ.)

(ఖ) గుణబోధకములు—

(వర్ణప్రసాదన, కేశ్య, పిచ్ఛిల).

(2) శబ్దార్థములు:—

లోహము:—లోహము (ఇనుము)వలె నల్లగను బరువుగను నుండునది. రాజార్హము:—రాజులకు యోగ్యమైన గంధమును గలది. కృమిజగ్ధము:— కృములచే జేయబడిన రంధ్రములను గలది. కాకతుండ:—కాకిముక్కువలె నల్లగ నుండునది. ధూపార్హ:—ధూపమువేయుటకు యోగ్యమైనది. మిశ్రవర్ణ:—రెండు మూడు కలిసినట్టి వర్ణములను గలది. వర్ణప్రసాదన:—వర్ణమును గలిగించునది. కేశ్య:—కేశములను వృద్ధిబొందించునది. పిచ్ఛిల:—పిచ్ఛిల గుణముగలది.

(చ) స్వాద్వగరు—కషాయరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. ఆమవాతమును బోగొట్టును. రా-వ.

(ఛ) మాంగల్యాగరు—శీతవీర్యమును, అధిక గంధమును గలిగి యుండును. యోగవాహి. రా-ని.

(3) భేదములు:—

ఇది కృష్ణాగరు, దాహాగరు, స్వాద్వగరు, మాంగల్యాగరు, కాష్ఠాగరు అని యైదు విధములుగా నుండి యెఱుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి సుగంధ ద్రవ్యములలో గణింపబడు చున్నది. ఇందలి భేదనిరూపకము లగు పదములను బట్టియు, దీనికి జెప్పబడిన యితర పర్యాయపదములను బట్టియు నాలోచింపగా నందు కృష్ణాగరు అనునది యినుమువలె నల్లగను మిగుల గట్టిగను, మిశ్రవర్ణయను నామమును బట్టి కొంచె మితరవర్ణముతో గలసిన నలుపువర్ణము గలదిగను, నుండునని దెలియగలదు. ఇది ధూపములకై యుపయోగింపబడు చున్నట్లు వర్ణింపబడినది. దాహాగరు అనునది దీనికి జెప్పబడిన "దాహకాష్ఠము, దాహసాగరు, తైలాగరు, వనవల్లభ" యను

పదములను బట్టి యిది తైలముతో గూడియుండుననియు, వనములందు అగ్ని సంయోగమువలన దీపమువలె వెలుగునట్టి స్వభావము గలదనియు దెలియ గలదు. మరియు నిది గూడ ధూపములు వేయుటకై నుపయోగింప బడు చున్నట్లు వర్ణింపబడినది. స్వాద్వగరు అనునది మధురరసమును గలిగి యుండు నట్లుగా దెలియగలదు. మాంగల్యాగరు అనునది కేదార క్షేత్రమునందు స్వనామముతో ప్రసిద్ధిగలిగి యుండునట్లుగా వైద్యకశబ్ద సింధువునందు జెప్పబడినది. ఇది స్వనామముచే మంగళకర మైనదనియు, గంధాఢ్యమని చెప్పబడుటచే మిగుల పరిమళముతో గూడి యుండుననియు దెలియగలదు. కాష్ఠాగరు అనునది పసుపుపచ్చని వర్ణముగలిగి యుండునట్లుగా వైద్యకశబ్ద సింధువునందు జెప్పబడినది. మరియు నిందలి కాష్ఠపదముచే నిస్సారవంతమై రూక్షముగ నుండుననియు దెలియగలదు. అయితే పై విషయమును బట్టి వీని స్వరూప మెట్లుండునదియు స్పష్టముగ దెలియకున్నది. మరియు బజారులందు అగరు అను పేరుతో నొకే విధమగు ద్రవ్యమే దొరకుచున్నది. కాని ఇన్ని భేదములతో గానరాకున్నది. మరియు నీ భేదము లన్నియు రాజనిఘంటు కారాదులచే వర్ణింపబడినవి గాని భావమిశ్రునిచే నిది సామాన్యాగరు, కృష్ణాగరు అను రెండు భేదములుగా వర్ణింపబడి విభాగింపబడినది. అయితే భావ మిశ్రు నిరూపణమును బట్టియు, బజారులం దొరకు కృష్ణమును నిస్సారము లగు నగరుకట్టెలతో జేరి దొరకుచుండు కృష్ణాగరును బట్టియు మిగిలిన భేద ముల కంతగా ప్రచారము లేదేమోయని దెలియుచున్నది. కావున వీని నింకను విమర్శించి నిశ్చయింపవలసి యున్నది.

అందు "రాస్నాగరుణీ శీతాపనయన ప్రలేపనానాం" అను చరకా చార్యుని నిరూపణమును బట్టి ముఖ్యముగా నగరుకట్టె యుష్ణమును గలిగించు టకు లేపాది రూపముగా నుపయోగింప బడు చున్నట్లు దెలియగలదు. మరియు నిది ప్రమేహకాస శోఫాదులందు గూడ నుపయోగింపబడు చున్నట్లు దెలియ గలదు. దీనినుండి తైలమును గ్రహించుదురు. ఇది గూడ కుష్ఠాదులందు అభ్యంగముకై ఉపయోగింప బడుచున్నట్లు దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) అగరు—స్నిగ్ధగుణమును గలిగి యుండును. కుష్ఠమును బోగొట్టును. ధ-ని., మధురరసమును, కటుకషాయాను రసములను, ధూమగంధమును గలిగి

యుండును. రా_ని. రుచిని బుట్టించును. ధూపమునకును, లేపమునకును ఉద్వర్తనమునకును శ్రేష్ఠమైనది. పరిమళమును గలిగి యుండును. ని_ర. వ్రణమును బోగొట్టును. రా_వ.

(ఘ) కృష్ణాగరు—ఇది యగరుకు చెప్పిన గుణములను హెచ్చుగ గలిగి యుండును. భా_ప్ర. కొద్దిగ నుష్ణవీర్యమును గలిగి యుండును. లేపనము జేసిన శీతవీర్యమును గలిగి యుండును. లోపలికి ఉపయోగించినప్పుడు పిత్తమును శమింపజేయును. (కొందరి మతమున త్రిదోషహరము). రా_ని.

(ఙ) తైలము కృష్ణాగరుకు జెప్పిన గుణములను గలిగి యుండును. భా_ప్ర.

(చ) దాహాగరు—కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. కేశములను వృద్ధి బొందించును. వర్ణమును గలిగించును. కేశములకు సౌగంధ్యమును గలిగించును. ఎల్లప్పుడు నుపయోగించిన కేశదోషములను బోగొట్టును. రా.ని.

(జ) కాష్ఠాగరు—కటురసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. లేపనముజేసిన రూక్షగుణమును గలిగియుండును. కఫమును శమింపజేయును. రా_ని.

(5) ప్రయోగములు:—1. హిక్కయందు అగరు ప్రయోగము. "మధునా సంయుతం లేహ్యం చూర్ణంవా కాలలోహజం" అగరుకట్టెచూర్ణమును తేనెతో గలిపి సేవించినహిక్క శమించును. చ_చి_అ_21.

2. దద్రుకుష్ఠములందు అగరు ప్రయోగము. "శింశపాగరుస్నేహో దద్రుకుష్ఠ కిటిభేషు" అగరుతైలము నభ్యంగము చేసిన దద్రుకుష్ఠము, కిటిభకుష్ఠమును శమించును. సు_చి_అ_31

3. లవణమేహమునందు అగరు ప్రయోగము. "లవణమేహినం పాఠాగరుకషాయం" చిరుబొద్ది, అగరుకట్టె వీని కషాయమును సేవించిన లవణమేహము శమించును. సు_చి_అ_11

4. కాసమునందు అగరు ప్రయోగము. "మధునైవచ జోంగకం" అగరు కట్టె చూర్ణమును తేనెతో సేవించిన కాసము శమించును. వా_చి_అ_3.

5. శ్వయథునందు అగరు ప్రయోగము. "చండాగరు విలేపనే" అగరు కల్కమును లేపనముజేసిన శ్వయథు శమించును. వా_చి_అ_17.

6. రసాయనమునకు అగరు ప్రయోగము. "అగరు చందనానాంపదంతి పౌనర్నవమేవ కల్కం" అగరుకట్టె కల్కమును పాలతో సేవించిన రసాయనమగును. వా_ఉ_అ_39.

(6) యోగములు:—1. అగర్వాది తైలము—చ—జ్వ.చి.
ఉపయోగములు—అభ్యంగము జేసిన శీతజ్వరము శమించును.

7. Actions and uses:—Used as perfume and as stimulant, cholagogue, also deobstruent. It is an ingredient in various nervine tonic, carminative and stimulent preparations. It is used in gout and rheumatism also to check vomitting A paste of Agara and Sápsandá with brandy is applied to the chest in bronchitis of children and to the head in headache.

R. N. Khory II p. 525.

## స్వానుభవము

8. చరకుడు దాహజ్వరప్రశమనమునకు చందనాది గణమును, శీతప్రశమనమునకు అగర్వాదిగణమును జ్వరచికిత్స 258 శ్లోకము మొదలు 267 శ్లోకమువరకును వర్ణించియున్నాడు. రోగుల అవస్థాభేదముల బట్టి స్నానమునకై అగరు చెక్కను వేసికాచిన నీళ్లను నేను వాడుచున్నాను. నస్యమునకు త్రిదోషఘ్నమై శ్రేష్ఠమగు తైలముగా చరకుడు వర్ణించిన అణుతైలమునందు చందనమును, అగరును, రెంటిని చేర్చి యున్నాడు. చ. సూ. అ. 5. శ్లో 4[illegible].

ఇందు అగరునకు ప్రాధాన్యమిచ్చుటచే దాని శ్రేష్ఠతను మనము గ్రహించవలసి యున్నది. (ఆ. ల.)

# 3

# అగ్నిమంథః—నెల్లిచెట్టు (తక్కాల).

## భాషాంతర పదములు

హిందీ—అరనీ మరాఠీ—అరణీ గుజరాతి—అరణీ, మలయాళం—మూన్నా కర్ణాటకం—నరుబల ద్రావిడం—మున్నా

## నైసర్గిక స్వరూపవర్ణనము

## Natural Order - Verbeneceae

టేకు కుటుంబము - కొందరు వావిలికుటుంబము అందురు.

అగ్నిమంథః—Premna Intergrifollia

ఈ కుటుంబమునందు పెద్దవృక్షములు, గుల్మములు, మొదలగునవి కలవు. ఇది యొక పెద్దకుటుంబము. ఈ కుటుంబపు మొక్కలు మనదేశమున చాలనే యున్నవి. ఆకులు అభిముఖచేరిక. లఘుపత్రములు. సమాంచలము. పుష్పములు అసరాళము. కింజల్కములు దళవలయపు తమ్మెలకంటె దక్కువయుండును. అండకోశము నాలుగు గదులు. ఒక్కొకగది యందొక్కొక యండముగలదు. ఈ కుటుంబము కొంచెమద్దసరము కుటుంబమును బోలి యుండును. ఈ కుటుంబమును పెదచెట్లో, దీగెలో, గుబురు మొక్కలో, పుష్పమంజరి యెట్టిదో, అండాశయమున నొకగదియో, ఎక్కువయున్నవో. కాయకండకాయయో, ఎండు కాయయో, వీనినిబట్టి జాతులుగను, తెగలుగను విభజించియున్నారు.

ఈ కుటుంబములో టేకు, గుమ్మడి, చిన్నగుమ్మడి, నెల్లి, నౌరుచెట్టు, వావిలి, చౌక్కాడు, నెమలడుగు, బ్రాహ్మణి, మొదలగు జాతులుగలవు. ఇందు వావిలి ఈ కుటుంబము యొక్క సామాన్యలక్షణములు కలదగుటచే దీనిని వావిలికుటుంబమని గూడ చెప్పుదురు. ఇది లషింగ్టన్‌లో 2695 వ నెంబరు. ఆకులు:—అభిముఖచేరిక లఘుపత్రములు సమాంచలము అడుగున మెత్తని రోమములు గలవు. కొన సన్నము.

పుష్పమంజరి—కొమ్మల చివరలనుండి ద్వివృంతమధ్యారంభ మంజరులగు పెద్దరెమ్మ గెలలు ప్రతిపుష్పము వద్దను చిన్నచేటిక గలదు. పుష్పకోశము:—సంయుక్తము గొట్టము వలెనుండును, అయిదో, ఆరో, తమ్మెలుండును. నీచము అది కాయనంటిపెట్టుకొని దానితో గూడ బెద్దదగును. దళవలయము:—సంయుక్తము గొట్టము పొట్టి తమ్మెలైదో, ఆరోయుండును. తమ్మెలన్నియు సమముగానే యుండును. కింజల్కములు:—దళవలయపు తమ్మెలన్నియున్నవి. కాడలు దళవలయమునంటియున్నవి. పుప్పొడి తిత్తులు రెండుగదులు అవి విడివి చౌకపాకారము. అండకోశము:—అండాశయము ఉచ్చము నాలుగుగదులు. ఒక్కొక గదిలో నొక్కొక్కగింజగలదు. కీలము సన్నము కీలాగ్రము రెండుచీలికలలో, పెంకుకాయ

అగ్నిమంథ అనువృక్షము సామాన్యముగ 20 అడుగుల ఎత్తు పెరుగుచెట్టు. ఆకులు 1½ మొదలు 3 అంగుళములు. ఉత్తరసర్కారులందు అరుదుగను తక్కిన దక్షిణహిందూస్థానము నందు మైసూరు పశ్చిమతీరమువరకు తరుచుగను 2500 అడుగుల ఎత్తువరకు కొండలలో పెరుగును.

పెద్దనెల్లికూర చిన్నచెట్టు. కొమ్మలు వ్యాపించియుండును. దీనిపువ్వులు పచ్చగానుండును. ఆకులను కొందరు కూరవొండుకొనెదరు. కాయలు కరివేపకాయలువలె గుండ్రముగాను పండ్లు కొంచెము తియ్యగా నుండును. కలప తెల్లగా నుండును దీనిని చాలపనుల కుపయోగించుచున్నారు.

## పర్యాయ పదములు

శ్లో॥ అగ్నిమంథో జయస్స్యాత్ శ్రీపర్ణీ గణికారికా।
జయా జయంతీ తర్కారీ నాదేయీ వైజయంతికా॥

అగ్నిమంథము, జయ, శ్రీపర్ణి, గణికారిక, జయా, జయంతి, తర్కారి, నాదేయి, వైజయంతిక అనునవి అగ్నిమంథ నామములు.

## అగ్నిమంథ గుణములు

శ్లో॥ అగ్నిమంథః శ్వయథునుత్ వీర్యోష్ణః కఫవాతహృత్।
పాండునుత్ కటుకస్తిక్తః తువరో మధురోఽగ్నిదః॥

నెల్లి కటురసమును, తిక్త-కషాయ-మధురరసములను, ఉష్ణవీర్యమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిపొందించును. కఫవాతములను శమింపజేయును. శోఫను పాండురోగమును పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—

అగ్నిమంథము, శ్రీపర్ణి, వైజయంతిక, (జ్యోతిష్క, అరణి, తనుత్వక్క).

(ఖ) ఉత్పత్తి బోధకములు:—

నాదేయి.

(గ) గుణబోధకములు:—

జయ, జయంతి, (పిత్తమాత).

(2) శబ్దార్థములు:—

అగ్నిమంథము—జ్యోతిష్క—అగ్నిని పుట్టించునది. శ్రీపర్ణి— అందమగు ఆకులను గలది. వైజయంతిక—వైజయంతి యను పతాకము

(జండా)పుబ్బోలు ఆకులనుగలది. అరణి. యజ్ఞాదులందుగాని, అడవులను దగల బెట్టునప్పుడుగాని యగ్నిని బుట్టించుటకు సాధనముగా నుండునది. తను త్వక్కు—పలచనగు పట్ట (పైతోలు) ను గలది. నాదేయి—నదులయొడ్డున ఉత్పన్నమగునది. జయ— జయంతి— దోషములను జయించునది. పిత్తమాత—పిత్తదోషమును వృద్ధిబొందించునది.

(3) భేదములు:—

ఇది చిన్న-పెద్ద భేదముచే రెండు విధములుగా నుండునట్లు దెలియగలదు. అందు మొదటిది "అగ్నిమంథిని (అగ్నిని బుట్టించునది). గంధపత్రి (వాసనతో గూడియుండు ఆకులను గలది). గంధపుష్ప (పరిమళించు పుష్పములను గలది)" యను మొదలగు నామములతో వ్యవహరింప బడుచుండును. "నాదేయి" యను పర్యాయనామము ఈ రెండింటికిని జెప్పబడియుండుట వలన నివి సామాన్యముగ నదులయొడ్డున నుత్పన్నమగునట్లు దెలియగలదు. ఇవి పైని జెప్పినట్లు పెద్ద-చిన్న భేదముచే జరుగుచున్నను గొంచెము హెచ్చు తక్కువగ సమాన గుణములనే గలిగి యుండునట్లు ఇతర నిఘంటువులను బట్టి గూడ దెలియగలదు. అయితే నీ ద్వివిధత్వమును భావమిశ్రు డేల నిరూపించలేదో దెలియకున్నది. ఒకవేళ నివి పెరుగుటలోనట్లు ఒకటి చిన్నదిగను, నొకటి పెద్దదిగను గానుపించునే గాని యుత్పత్తి స్వరూపగుణాదులం దెట్టి భేదమును గలిగి యుండవను నుద్దేశ్యముతో నటుల భావమిశ్రునిచే నట్టి ద్వివిధత్వము జేర్కొనబడక యుండవచ్చునని యొకింత యూహింపవగును. ఇదియును గాక విశేషముగా నొక విధమగు నెల్లియే దొరకుచుండును. ఇది దశమూలములలో నొక ద్రవ్యముగా వ్యవహరింపబడు చున్నది. విశేషముగా దీని మూలమునే గ్రహించుదురు. దీనిని ప్రత్యేకముగ నుపయోగించినయెడల నిది కఫవాతములను శమింపజేసి పిత్తమును వృద్ధిబొందించును. దశమూలములందుగల నితర ద్రవ్యములతో జేర్చి యుపయోగించినప్పుడు త్రిదోషములను శమింపజేయును. వ్యవహారమునం దీ చెట్టుయొక్క కర్రలను యజ్ఞాదులందును, అడవులను దగులబెట్టు నప్పుడును అగ్నిని బుట్టించుటకై యుపయోగించుట గలదు. అనగా-ఈ చెట్టుయొక్క కర్రల రెండింటిని గ్రహించి యొకదానితో నొకటిజేర్చి గట్టిగ మథించిన(రాచిన)యెడల అందుండి యగ్ని యుత్పత్తి యగును. ఈ యగ్నిని పై కార్యముల కుపయోగింతురు.

మరియు ఈ వృక్షములు విశేషముగ నున్నచోట్ల నవి గాలియొక్క వేగముచే నొకదానితో నొకటి రాపాడగా నందుండి యగ్నిబుట్టి యది చుట్టుప్రక్కల నున్న వృక్షముల నెల్ల దగులబెట్టును. ఇందుచే నడవులలో వీనిని విశేషముగా పెరుగనీయరు

(4) విశేషగుణములు:—

(క) పెద్దనెల్లి—అగ్నిమాంద్యమును, స్రోతో బంధమును బోగొట్టును. ధ-ని. అగ్నిప్సను, మలమునందలి దుర్గంధమును, అధ్మానమును బోగొట్టును. రా-ని. గురు సర గుణములను గలిగి యుండును. ఆమదోషమును బోగొట్టును. శో-ని. ప్రతిశ్యాయమును, ఆమవాతమును, మలబంధమును, విషమును, మేదో రోగమును బోగొట్టును. ని-ర.

(ఖ) చిన్ననెల్లి—ద్వివిధాగ్నిమంథములు రసగుణ వీర్యాదులందు సమానముగనే యుండును. రా-ని. విశేషముగ శోథయందు లేపనమునకును, ఉపనాహమునకును శ్రేష్ఠమైనది. ని-ర.

(గ) అగ్నిమంథశాకము—మధురరసమును, కొద్దిగ తిక్తానురసమును, లఘుగుణమును గలిగి యుండును. జాఠరాగ్నిని వృద్ధిబొందించును. బలమును గలిగించును. బృంహణము. త్రిదోషములను శమింపజేయును. స-గు-క.

(5) ప్రయోగములు

1. అర్శోవ్యాధియందు అగ్నిమంథ ప్రయోగము.

"అగ్నిమంథస్య పత్రాణి...... ।
జలేనోత్క్వథ్యశూలార్తం స్వభ్యక్తమవగాహయేత్ "॥

మూలవ్యాధియందు శూల విశేషముగా నున్నయెడల నెల్లియాకుల కషాయమును సిద్ధముజేసి గోరువెచ్చగా నున్నప్పుడు రోగియొక్క గుదమునకు తైలముతో నభ్యంజనము జేసి పై కషాయమునందు గుదప్రదేశము మునుగు నటుల రోగిని గూర్చుండబెట్టి యవగాహన స్వేదము జేసిన శూల శమించును. చ-చి-అ-9.

2. గ్రంధియందు అగ్నిమంథ ప్రయోగము.

"వంశపత్రాణ్యగ్నిమంథం కుర్యాద్గ్రంధి ప్రలేపనం"

వెదురాకులను, నెల్లివేళ్ళను మెత్తగా నూరి గ్రంధికి లేపనముజేసిన హితము. చ-చి-అ-11.

3. ఊరుస్తంభమునం దగ్నిమంథ ప్రయోగము.

"అగ్నిమంథకరంజౌచ జలే నోత్క్వాథ్య సేచయేత్ ।
ప్రలేపోమూత్రపిష్టైర్వా పూర్వోక్త స్తంభ నివారణః" ॥

ఊరుస్తంభవాతమునందు నెల్లివేళ్లు, కానుగవేళ్లు వీని కషాయమును సిద్ధముజేసి, దీనితో సేచనముజేసినను, పై మూలములను గోమూత్రముతో మెత్తగానూరి లేపనముజేసినను ఆ వ్యాధి శమించును. చ_చి_అ_27.

4. ఇక్షుమేహమునందు అగ్నిమంథ ప్రయోగము.

"ఇక్షుమేహినం వైజయంతీకషాయం"॥

ఇక్షుమేహరోగి నెల్లివేళ్ళ కషాయమును పానముజేసిన ప్రమేహము శమించును. సు_చి_అ_11.

5. వసామేహమునందు అగ్నిమంథ ప్రయోగము.

"వసామేహినం అగ్నిమంథకషాయం"

వసామేహరోగి నెల్లివేళ్ళ కషాయమును పానముజేసిన యా ప్రమేహము శమించును. సు_చి_అ_11.

6. వ్రణమునందు అగ్నిమంథప్రయోగము.

"మాతులుంగాగ్నిమంథౌ చ...... కాంజికేనచ ।
లేపోవాత వ్రణేహితః" ॥

మాదీఫలపుచెట్టు వేళ్ళను, నెల్లివేళ్లను కాంజికముతో నూరి లేపనము జేసిన వాతజవ్రణము శమించును. హా_సం.

7. శీతపిత్తమునం దగ్నిమంథ ప్రయోగము.

"అగ్నిమంథభవం మూలం పిష్టం పీతంచ సర్పిషా ।
శీతపిత్తో దర్దకోఠాన్ సప్తాహాదేవనాశయేత్"

నెల్లివేళ్ల కల్కమును ఘృతముతో జేర్చి సేవించుచుండిన శీతపిత్తము ఉదర్దము, కోఠము ఇవి యేడు దినములలో శమించును. చ. ద.

8. స్థౌల్యమునం దగ్నిమంథ ప్రయోగము.

"స్థౌల్యనుత్స్యాత్ అగ్నిమంథరసం వాపి శిలాజతు" ॥

గోమూత్రశిలాజితును నెల్లివేళ్లకషాయముతో సేవించిన స్థౌల్యము శమించును. చ_ద_

9. వ్యంగమునందు అగ్నిమంథప్రయోగము.

"తద్వాఽరణీత్వ గథవా భగలీ స్తనోత్థ
క్షీరాన్వితా శమయతి ప్రసభం ప్రలేపాత్"॥

నెల్లివేళ్ల పట్టను మేకపాలతో నూరి లేపనము జేసిన శీఘ్రముగా వ్యంగము శమించును. గ_ని.

10. ఉదరశోథయం దగ్నిమంథ ప్రయోగము.

"అరణీక్షార సమ్మిశ్రం తోయం క్వథితశీతలం ।
త్రిదినం పానతోఽభ్యంగాత్ శోథం హన్త్యుదరోత్థితం"॥

నెల్లిక్షారమును కాచి చల్లార్చిన జలముతో మూడు దినములు సేవించి, తైలముతో నభ్యంగముజేసిన ఉదరవ్యాధియందు బుట్టిన శోథ శమించును గ_ని

6. Actions and uses:—Stomachic, alterative and tonic- The infusion of the leaves is used in eruptive fevers, colic and flatulance; the decoction of the root is given in gonorrhoea, during convalesence from fevers; also in rheumatism and neuralgia.

Ainsle states that the root has a warm bitter taste and agreeable smell; and is prescribed in decoction as a general cordial and stomachic in fevers, Rheede calls the plant Appeal, and notices the use of a decoction of the leaves for flatulence. Atkinson states that the leaves rubbed with pepper are administered in colds and fevers, and that externally a decoction of the whole plant is used in rheumatism and neuralgia.

Dymock III. P. 67

స్వా ను భ వ ము

7. అగ్నిమంథ దశమూలములలో దీనిచే ముఖ్యముగా ఔషధములలో నుపయోగించునపుడు మూలము ప్రధానముగా గలది. వాతహరత్వము దానికి ముఖ్యమైన గుణము. కాని దశమూలములలో చేర్చి ఉపయోగించుటయే గాని ప్రత్యేకముగ ఉపయోగించు సంప్రదాయము లేదు. కని యాకులు వాతహరమని పులుసుకూర చేసుకొనితినుట

ఆచారము గలదు. కొద్దిగా వాసన ఉండును. కొందరు మంచి వాసన అందురు గాని కొందరికి కిట్టదు. ఆరోగ్యవంతులుగూడ తినవచ్చును. నే ననేకసార్లు తిని యున్నాను. ప్రస్తుతము ప్రజ లుపయోగించు దానికంటె ఎక్కువగ నుపయోగించదగిన పత్రి శాకము. ఆకుకూరలేమీ దొరకనిరోజులలో కూడా అనగా అన్ని ఋతువులలో దొరకునది కాబట్టి మిక్కిలి ఉపయోగము. సులభముగా పెరిగే మొండిచెట్టు కాబట్టి గ్రామాదులలో ఎక్కువగ పెంచతగినది. మలబద్ధమును కొట్టివేయుటకు మిక్కిలి ఉపయోగము. ఉడికించి నీళ్ళను తీసివేసిన వాసన పోవును. కీళ్లనొప్పు లున్నవారలకు పథ్యముగ నిచ్చియున్నాను. [అ.ల.]

---

# 4

# అజగంధా - వాయిం (విం) ట.

## భాషాంతర నామములు

హింది—హులహుల, మరాఠి—తీలవన, గుజరాతి—తలవణీ, మలయాళం—ఆట్టునారివేళా, కర్ణాటకం-బేలేయగిడ, ద్రావిడం-నాయుర్ వేళై.

## నైసర్గిక స్వరూపవర్ణనము

## Natural Order - Capparidiaceae

వాయింట కుటుంబము.

లాటిన్—Gyrandropris Pentaphylla

ఈ కుటుంబమునందు మావలింగపుచెట్టు, కుక్కవాయింట, ఆరుదొండ, పరికి, పట్టతీగ, ఆగుజ, గులి, అను జాతులుగలవు.

ఈ కుటుంబమునందు గుల్మములు గుబురు మొక్కలు చెట్లును గలవు. ఆకులు ఒంటరి చేరిక, లఘుపత్రములుగాని తాళపత్రవైఖరినున్న మిశ్రపత్రములుగాని గలవు. కొన్నిటిలో గణుపు పుచ్ఛములున్నవి. కొన్నిటిలో నవి ముళ్లవలె మారియున్నవి. రక్షకపత్రములు, ఆకర్షణపత్రములు నాలుగేసి యుండును. సాధారణముగ కింజల్కములెక్కువగ నుండును. అండాశయము ఒక జాతిమొక్కలందు దప్ప మిగిలినవానియందు గింజల్కముల మధ్యనుండి పైకివచ్చిన వృంతాగ్రముపై యున్నది. లండములు రెండువరుసలు. కుడ్యసంయోగము. కీలము లేదు.

వాయింట మొక్క మూరడుగులెత్తువఱకు బెరుగు నేకవార్షికపు గుల్మము. కొమ్మల కొక్కొక్కప్పుడు రంగుండును. లేగొమ్మలపై రోమములును జిగటయు గలదు.

ఆకులు:—ఒంటరిచేరిక. మిశ్రపత్రములు: తాళపత్రవైఖరి అయిదు చిట్టియాకులు గలవు. చిట్టియాకులకు దొడిమ లేదు, అన్నియు సమముగా నుండవు, సమాంచలము, కొన సన్నము. రెండువైపుల జిగురు జిగురుగా నుండు రోమములుగలవు. లొడిమపై జిన్న చిన్న ముళ్లవంటివి కలవు.

పుష్పమంజరి:—కొమ్మల చివరలనుండి గెలలు లేతవి గుత్తులవలె నగుపించును. గెలలపైన ఆకులవంటి చేటికలు గలవు వాటిలో మూడేసి చిట్టిపత్రములున్నవి. అడుగున నున్నవాని కణుపునందులో బువ్వులు లేవుగాని పై వానియందు గలవు, పువ్వులు చిన్నవి. ఉపవృంతము పొడుగుగానే యుండును.

పుష్పకోశము:—రక్షకపత్రములు 4. బల్లెపాకారము. జిగటగనుండు రోమములుగలవు.

దళవలయము—ఆకర్షణపత్రములు నాలుగు. పినికి నిడుపాటి పాదములుగలదు. తెలుపు.

కింజల్కములు:—6. వృంతాగ్రము ఆకర్షణపత్రముల మధ్యనుండి పైకివచ్చి యున్నది. దీనినే కింజల్కములంటుకొని యున్నవి.

అండకోశము:—అండాశయము ఉచ్ఛము. దీనికిని కింజల్కములకును మధ్యవృంతాగ్రము పొడుగుగనేయున్నది, ఒకగది. అండములు చాలగలవు. కాయ యెండి పగులును. కీలము లేదు. కీలాగ్రము పెద్దది. దానిపై రంధ్రములుగలవు. వావింటకుటుంబము లషింగ్టన్ పట్టీలో 7 సంఖ్య క్రింద వర్ణింపబడియున్నది.

## పర్యాయ పదములు

శ్లో॥ అజగంధా బస్తగంధా ఖరపుష్పా సుగంధికా।
కబరీ బర్బరాగంధా తుంగీ పూతిమయూరికా॥

అజగంధ, బస్తగంధ, ఖరపుష్ప, సుగంధిక, కబరి, బర్బరాగంధ, తుంగి, పూతిమయూరిక అనునవి అజగంధ నామములు.

## అజగంధా గుణములు

శ్లో॥ అజగంధా కటూష్ణా స్యాద్వాత గుల్మోదరాపహా,
కర్ణవ్రణార్తి శూలఘ్నీ, పీతా చేకంజ సేహితా॥

వాయింట కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాతమును శమింపజేయును. గుల్మము, ఉదరము, కర్ణవ్రణము, కర్ణశూల అను నీ వ్యాధులను బోగొట్టును. పచ్చపువ్వులుగల వాయింట నేత్రముల కంజనము వేయుటకు హితమైనది.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—

అజగంధ, బస్తగంధ, (ఉగ్రగంధ.)

(ఖ) గుణబోధకములు:—

ఖరపుష్ప, తుంగి, (కర్ణస్ఫోట.)

(2) శబ్దార్థములు:—

అజగంధ-బస్తగంధ-మేకయొక్క వాసనవంటి వాసనగలది. ఉగ్రగంధ-తీక్ష్ణమగు పరిమళమును గలది. ఖరపుష్ప-ఖరగుణముగల పుష్పమును గలది. తుంగి-వ్యాధులను బోగొట్టునది. కర్ణస్ఫోట-కర్ణమును వికసింప జేయునది.

(3) భేదములు:—

ఇది సామాన్యవాయింట, కుక్కవాయింట యని రెండు విధములుగా నుండి క్షుపవర్గములో గణింపబడు చున్నది. ఇందు మొదటిది తెల్లపువ్వులను రెండవది పసపుపచ్చని పువ్వులను గలిగి యుండును. పైని జెప్పినట్లు ఘాటుగ నుండు వాసనను గలిగి యుండును. వీని యాకు కొంచెము పొడవుగలిగి కళావరు చుక్కవంటి యాకారముతో నొప్పి యుండును. కాయలు సన్నముగ పెసరకాయలంత యుండును. ఈ కాయలకును, పత్రపుష్పనాళములకును సన్నని నూగు అంటి యుండును. బీజములు నల్లని వర్ణముగలిగి చిన్నవిగ నుండును. దీని పత్రముల రసమును మూర్ఛాది వ్యాధులందు నస్యముకై ఉపయోగింతురు మరియు నీ పత్రములను మెత్తగా నూరి రసమును బాగుగా పిండివేసి నట్టి ముద్దను సన్నిపాతరోగికి ఇంద్రియనాశము గలిగినప్పుడు రోగియొక్క శిరస్సున బ్రహ్మరంధ్రముపై నుంచి కట్టు గట్టుదురు. కొంతకాల మైనపిమ్మట కట్టువిప్పి చూచినచో నా ముద్ద పూర్తిగా ద్రవముతో నిండియుండును. అట్టి ముద్దను చక్కగా పిండి తిరిగి బ్రహ్మరంధ్రముపైనుంచి కట్టుగట్టుదురు.

ఇటుల నా ముద్దను పలుమారు పిండుచు తిరిగి అందు ద్రవము చేరకుండునంత వరకు కటులతో కట్టు గట్టుదురు. ఇటుల చేయుచున్నప్పుడు ఆ ముద్దయందు ఎప్పుడు తిరిగి ద్రవము చేరకుండ యుండునో, అప్పుడు రోగికి ఇంద్రియప్రసాదము గలుగును. మరియు జంగమ విషములకు దీని పత్రస్వరసము లేప నస్యాది రూపముగ నుపయోగించుటయు వ్యవహారమునందు గానబడును.

(4) విశేషగుణములు:—

జఠరాగ్నిని వృద్ధిపొందించును. కఫపిత్తజ జ్వరమును, ప్లీహాభివృద్ధిని, విషమును, ఆనాహమును, కఫజశూలను పోగొట్టును. ని.ర. తిక్తానురసమును, శీతవీర్యమును గలిగి యుండును. గ్రహభూతాది వికారములను పోగొట్టును. రా.ని. తీక్ష్ణ లఘు రూక్ష గుణములను గలిగి యుండును. హృదయమునకు హితమైనది. దృష్టిమాంద్యమును గలిగించును. శుక్రమును క్షీణింపజేయును. కఫవాతములను శమింపజేయును. మ.ని.

(5) ప్రయోగములు:—

1. జ్వర పూర్వరూపమునందు అజగంధాప్రయోగము.

"నీలినీమజగంధాంచ త్రివృతాం కటురోహిణీం।
పిబేజ్జ్వరాగమే యుక్త్యా"

నీలి, వాయింట, తెగడ, కటుకరోహిణి వీని కల్కమును గాని కషాయమును గాని జ్వరపూర్వరూపమున సేవించిన జ్వరము వ్యక్తము గాకముందే శమించును. చ.చి.అ.3.

(6) యోగములు:—

1. అజగంధాదిలేపము—వా.ఉ.ముఖరోగ.

ఉపయోగములు—లేపనము జేసిన కఫజగలగండ శమించును.

2. అజగంధాదిలేపము—గ.ని.విసర్ప.

ఉపయోగములు:—లేపనము జేసిన కఫజవిసర్పము శమించును.

3. అజగంధాది లేపము—వై.చిం.వ్రణ.

ఉపయోగములు:—లేపనము జేసిన కఫజవ్రణశోఫ శమించును.

(7) **Medicinal uses**:—The powdered seeds in doses of about 30 grains are anthelmientic and the juice of the leaves is used occasionally for earache and otorrhoea and other affections of the ear.

(Indigenous drugs of India)

## స్వానుభవము

తలనొప్పి తగ్గుటకు వావింట ఆకు నలగకొట్టి పిడిచి తల మీద గుడ్డతో కట్టుకట్టుదురు. ఆకులను ముద్దగానూరి అపక్వవిద్రధులకు కట్టుదురు. చెవులో పోటునకు వావింటాకు రసము పిండుటగలదు. ప్రసవముగాక కష్టపడు స్త్రీలకు వావింటరసము ఒక తులము త్రాగించిన సుఖప్రసవమగునని వస్తుగుణ ప్రకాశికయందు గలదు. పరీక్షించి చూడవలెను. (ఆ. ల.)

---

# 5

# ఆతసీ (గస్త్యః) అవిశెచెట్టు

## భాషాంతర నామములు

హిందీ—హాతియా, మరాఠీ—అగస్తా, గుజరాతి—అగథియో, మలయాళం—అగతి. కర్ణాటకం—అగసె. ద్రావిడం—అగత్తి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Leguminosae.

చిక్కుడు కుటుంబము

అవిశెచెట్టు: (Sesbania Grandiflora.)

చిక్కుడుకుటుంబము మిగుల పెద్దకుటుంబములలో నొక్కటి. మన కాహారపదార్థములగు కందులు పెసలు మొదలగున వీకుటుంబములోనివే. ఇందు చిన్నమొక్కలు, తీగెలు, పెద్దచెట్లుకూడగలవు. ఆకులు మిశ్రిమపత్రములు. కింజల్కములు సాధారణముగా బదియుండును. అంతకు నెక్కువయు దక్కువయు నుండుటకూడకలదు. అండాశయము ఒకగది. కాయ పండి రెండువైపుల బ్రద్దలగును. ఇదియే యీకుటుంబపు ముఖ్యలక్షణము. కొన్నిటి పుష్పములు చిక్కుడుపువ్వువలె కీటకాకారములుగను మరికొన్నిటిలో కసింద, చింత పువ్వులలో

వలె పువ్వులరేకు నించుమించు సమముగాను, తుమ్మ సీమచింత మొదలగు కొన్నిటియందు పువ్వులు చిన్నవిగాను బంతులుగాను నుండును. ఈ భేదములనుబట్టి నీ కుటుంబమును మూడు ఉపకుటుంబములుగా విభజించియున్నారు.

పత్రికాండము:—తిరుగుడుతీగె అడుగున గుప్పెడు లావున నుండును. దారువుగలదు. ఏకవార్షికము.

ఆకులు:—ఒంటరిచేరిక. మిశ్రమపత్రములు. నూరేసి చిట్టియాకులుండును. చిట్టి యాకు. హృదయాకారము, సమాంచలము, విషమరేఖపత్రము, రెండు వైపుల సున్నగ నుండును. కొన సన్నము.

పుష్పమంజరి:—గెల. ఒక్కొక్కప్పుడు దీని మొదట నాకులును గలుగుచుండును. పువ్వులు పెద్దవి, తెల్లగానయినను నీలపురంగుగా నయినను నుండును. అసరాళము, సీతాకోక చిలుకవలె నుండును. చేటికలు, ఉపవృంతమువద్ద నొకటి, పుష్పకోశమువద్ద నొకటి గలవు.

పుష్పకోశము:—సంయుక్తము, 5 దంతములు. నీచము.

దళవలయము:—5 ఆకర్షణపత్రములు 1 అన్నిటికంటె పెద్దదిగానున్నది ఇది పతాకదళము. పుష్పములో పొడుగుగా జండావలె నుండుటచే దీనికిపేరు గలిగెను. దీనిముందు రెండుపడిగానున్న రేకులు గలవు. ఇవి రెక్కలవలె నుండుటచే పక్షదళములందురు. వీని రెండింటిచే గవ్వబడి చుక్కానువంటి దొకటిగలదు; ఇది రెండు రేకులు గలసి ఏర్పడు చున్నది. దీనిని ద్రోణీదళమందురు. దళవలయము పుష్పకోశము నంటియున్నది.

కింజల్కములు:—10 ఇవియు వంగి ద్రోణీదళములో నణగుపడి యున్నవి. పదియు మొదట గొట్టమువలె గలిసియున్నవి. పుప్పొడి తిత్తులు చిన్నవి.

అండకోశము:—అండాశయము ఉచ్చము, 1 గది, కీలము సన్నము; కీలాగ్రము గుండ్రము. మొదట నిదియు ద్రోణీదళములో మణుగుపడి యున్నది. ద్వివిదారుణ ఫలము.

చిక్కుడు కుటుంబమునందు చిక్కుడు, గోరుచిక్కుడు, కంది, పెసర, మినుము. శనగ, ఉలవ, బొబ్బర, అనప, పటాణి, వేరుసెనగ, మెంతి, నీలి, జనుము, చింత, సీమచింత, తుమ్మ, ఖదిరము, షికాయి, గానుగ. దిరిసెన, నిద్రగన్నేరు. గురివింద, రక్తచందనము, చందనము.చాదిత, విరుగుడుచేవ, అనిశె, దేవకాంచనము, తంగేడు,సునాముఖి. ఆడ్డాకు, మోదుగ, శిసింత, రేల, జీలుగ. గిలగిచ్చ, గచ్చ, తురాయి, చెమ్మ, దూలగొండ మొదలగు జాతులుగలవు.

## పర్యాయ పదములు

శ్లో॥ అథాగస్త్యో వంగసేనో మునిపుష్పో మునిద్రుమః॥

అగస్త్యము, వంగసేనము, మునిపుష్పము మునిద్రుమము అనునవి యగస్త్యనామములు.

## అగస్త్య గుణములు

శ్లో॥ అగస్తిః పిత్తకఫజి చ్చాతుర్థికహరోహిమః।
రూక్షో వాతకరస్తిక్తః ప్రతిశ్యాయ నివారణః॥

అవిశె వేరు తిక్తరసమును, రూక్షగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. వాతమును వృద్ధిపొందించును. పిత్తకఫములను శమింపజేయును. చాతుర్థిక జ్వరమును, ప్రతిశ్యాయమును బోగొట్టును.

## అగస్త్య పుష్పగుణములు

శ్లో॥ అగస్తికుసుమం శీతం చాతుర్థిక నివారణం ।
నక్తాంధ్య నాశనం తిక్తం కషాయం కటుపాకిచ॥
పీనసశ్లేష్మ పిత్తఘ్నం వాతఘ్నం మునిభిస్మృతం। [సుశ్రుత].

అవిశెపువ్వు తిక్తరసమును, కషాయానురసమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. త్రిదోషములను శమింపజేయును. చాతుర్థిక జ్వరమును, నక్తాంధ్యమును, పీనసమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయ బోధకములు:—

మునిపుష్పము, మునిద్రుమము, (శీఘ్రపుష్పము, దీర్ఘఫలక, రక్తపుష్పము, శుక్లపుష్పము, మునిప్రియ, వక్రపుష్పము.)

(ఖ) గుణబోధకములు:—

(వ్రణాపహ.)

(గ) ఉత్పత్తి బోధకములు:—

అగస్త్యము.

(2) శబ్దార్థములు:—

మునిపుష్పము—మునుల కిష్టమగునట్టి పుష్పములను గలది. మునిద్రుమము—మునిప్రియ—మునుల కిష్టమగు వృక్షము. (లేక) మునుల ఆశ్రమములందు వృద్ధిపొందునట్టి వృక్షము. శీఘ్రపుష్పము—త్వరగా పుష్పించునట్టిది. దీర్ఘఫలక—పొడవుగానుండు కాయలను గలది. రక్తపుష్పము—శుక్లపుష్పము—వక్రపుష్పము—ఎఱ్ఱని (లేక) తెల్లని వర్ణము గలిగి వంకరగానుండు పుష్పములను గలది. వ్రణాపహ—వ్రణములను బోగొట్టునది. అగస్త్యము—పర్వతములందు విశేషముగా పెరుగునది.

(3) పరిచయబోధక లక్షణము:—

"స్నిగ్ధో౽గస్తిః పంక్తిపత్రో మృదుసింబీ మహీరుహః ।
అగస్త్యస్యోదయం యావత్సపుష్ప ఇహవృక్షకః ॥"

అవిశెచెట్టు మిగుల నెత్తుగా పెరిగి పంక్తివలె వరుసగానుండు చిన్న చిన్న పత్రములతో నొప్పి మృదువుగనుండు బీజములతో గూడిన గాయలను గలిగి యుండును. ఈ వృక్షము అగస్త్యనక్షత్ర మెంతకాలము గానుపించునో యంతవరకు పుష్పించు చుండును. శి.ప.

(4) భేదములు:—

ఇది శుక్ల-నీల-రక్త-పీత వర్ణభేదముచే నాలుగు విధములుగ నుండి, యెత్తుగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి పుష్పవర్ణములచే గణింపబడు చున్నది. పై వర్ణమును బట్టి చింతాకులకంటె కొంచెము పెద్దవిగనుండు ఆకులు చింత ఈనెలవలె పొడవుగనుండు ఈనెలకు రెండు ప్రక్కలను వరుసగా నంటియుండును. దీని కాయలు మిగుల పొడవుగా నుండును. పుష్పములు అర్ధచంద్రాకృతిగ వంగి ముద్దగా నుండును. ఇది కొంచెము హెచ్చుతక్కువ జిలేబికాయలవలె నుండునని చెప్పవచ్చును. మరియు నివి పైని చెప్పినట్లు నీ యా బీజభేదము ననుసరించి శుక్ల నీలాది వర్ణములను గలిగి యుండును. వీనిని పూజలకై యుపయోగించెదరు. దీని యాకులను శాకముగా నాహారముగ నుపయోగించెదరు. మరియు నీ వృక్షములను విశేషముగా నొక తోటవలె పెంచి, ఈ వృక్షముల మూలభాగమునందు తమలపాకు తీగెలను పాతుదురు. ఈ తీగెలు చక్కగా నీ యవిశెచెట్లను సలుపక్కలను అల్లుకొని వృద్ధిపొందును. వైద్యమునందు దీని యాకులను, బీజములను, పుష్పముల పసు వర్ణనలో భాగములను ప్రయోగము గలదు. మరియు నీ పత్రస్వరసమును శ్లేష్మహృష్యకము లేపనముకై యుపయోగించుదురు. ఈ స్వరసముతో తాళ్ళ గూడ ధాతుద్రవ్యములకు శోధనసంస్కారము గూడ జేయుదురు.

(5) విశేషగుణములు:—

(క) మధురానురసమును, మదగంధమును గలిగి యుండును. జఠరాగ్ని వృద్ధిబొందించును. యోనిశూల, తృష్ణ, కసము, శోధ, దాహము, శ్వాస, క్షయ వీనిని బోగొట్టును. రా.ని. బలమును క్షీణింపజేయును. త్రిదోషములను శమింపజేయును. కాసను, వైవర్ణ్యమును, భ్రమను, భూతగ్రహాది వికారములను బోగొట్టును. శా.ని.

4. వాతరక్తమునందు అగస్తి ప్రయోగము.

"అగస్తిపుష్పచూర్ణేన మాహిషం జనయేద్దధి ।
తదుత్థనవనీతేన దేహం స్ఫోటం జయేత్"

కాచిన గేదెపాలయందు అవిశెపువ్వుల చూర్ణమును కలిపి దధిభావమును బొందించి యందుండి గ్రహించిన నవనీతముతో లేపనము చేసిన వాతరక్తమునందలి పగిలి స్రావముతో గూడిన పిటికలు శమించును. భా-ప్ర.

5. చాతుర్థిక జ్వరమునందు అగస్తి ప్రయోగము.

"అగస్తిపత్రస్వరసేన నస్యం నిహంతి చాతుర్థిక ముగ్రరూప"

అవిశె యాకు రసమును నస్యము చేసిన తీవ్రమగు చాతుర్థికజ్వరము కూడ శమించును. బృంద.

6. శూలయందు అగస్తి ప్రయోగము.

"నాగరశోభాంజనయోః క్వాథః శూలం వినాశయేత్ త్రిదినాత్ ।
మునితరువల్కక్వాథః తద్వత్ పటురామఠ ప్రతివాపః"

అవిశెపట్ట కషాయమునందు సైంధవలవణమును, ఇంగువను చేర్చి సేవించిన మూడు దినములలో శూల శమించును. వై-ము.

7. Actions and uses:—The root is expectorant. The bark astringent bitter tonic. The juice of leaves and flowers is blown up the nostrils in nassal catarrh and headache with relief. The juice of the root is given with honey in catarrh. A paste of the root is applied to painful swellings. (Materia Medica of India). R. N. Khory Part II p. 229-30,

నీలఅగస్తి:—(అతసీ) Linum usitatissimum (N. O. Lineae).

Physiological actions;—Demulcent, diuretic, expectorant, and emollient. In large doses it is laxative. In small doses it stimulates the kidneys. It is oxidized in the system and excreted as a resinoid body in the urine. Its infusion is given in inflammation of them ucousmembranes of the respiratory, digestive and urinary organs; also in vesical and renal irritation. R. N, Khory Part II. p. 151.

Therapeutics:—As it contains a mucilaginous principle and a little oil, it is given with honey in coughs and catarrh. As a demulcent and diuretic it is given in renal colic, cystitis vesical irritation, strangury, vesical catarrh and calculi.

# 6

# అతివిషా - అతివస

హిందీ—అతీస్, మరాఠీ—అతీవిష, గుజరాతీ—అతివఖ్నీకళీ, తమి ళము—అతివిడయం, కన్నడం—అతీసా, ద్రావిడం—అతివిడయం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Renunoulaceae

### నాభి కుటుంబము

### అతివిష— Aconitum Heterophyllum.

(నాభి కుటుంబములోని మొక్కలు చాలా భాగము శీతల ప్రదేశములలో పెరుగు చున్నవి. వీనిలో ఇంచుమించు అన్నియు గుల్మములు. ఆకులు ఒంటరిచేరిక. ఒక జాతి మొక్కలందు మాత్రమునడిముఖచేరికగా నున్నవి. రక్షకపత్రములు, ఆకర్షణపత్రములు గలవు. కింజల్కములు. స్త్రీ పత్రములు, అసంఖ్యములుగా నున్నవి. గింజలలో అంకురచ్ఛదము గలదు.)

అతివస:—వేరు. ఈ మొక్కయు హిమాలయాపర్వతముల మీదనే పెరుగుచున్నది. ఇది విషముకాదు. దీనిలోను రెండు మూడు రకములున్నవి.

ఈ జాతి మొక్కలింకను గలవు. వానివేరులలో విషము గలదు.

## పర్యాయ పదములు

శ్లో॥ విషా త్వతివిషా విశ్వా శృంగీ ప్రతివిషా రుణా,
శుక్లకందా చోపవిషా భంగురా ఘుణవల్లభా॥

విష, అతివిష, విశ్వా, శృంగి ప్రతివిష, అరుణా, శుక్లకంద, ఉపవిష, భంగుర, ఘుణవల్లభ అనునవి అతివిషానామములు.

## అతివిషా గుణములు

శ్లో॥ విషా సోష్ణా కటుస్తిక్తా పాచనీ దీపనీ హంతి,
కఫ పిత్తాతిసారామ విష కాస వమి కృమీన్॥

అతివస కటురసమును, తిక్తరసమును, ఉష్ణవీర్యమును గలిగియుండును. ఆమమును పచింపజేయును. జఠరాగ్నిని వృద్ధి బొందించును. కఫపిత్తములను శమింపజేయును. అతిసారము, ఆమదోషము, విషము, కాసము, వాంతి, కృములు అను నీ వ్యాధులను పోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—శుక్లకంద, అరుణ, భంగుర, ఘుణవల్లభ, విష, ఉపవిష.

(ఖ) గుణబోధకములు:—విష, ప్రతివిష.

(2) శబ్దార్థములు:—

శుక్లకంద:—తెల్లని దుంపవలె నుండునది. అరుణ—అరుణవర్ణము గలది, భంగుర—సులభముగ విరుగునది. ఘుణవల్లభ—పురుగులకు (కర్రలను తొలచునట్టి) లేక తుమ్మెదలకు ప్రియమైనది. విష—విషజాతులలో జేరి విషప్రాయముగ నుండునది. ఉపవిష—ఉపవిష ద్రవ్యములలో జేరినది. ప్రతివిష—విషములను శమింపజేయునది.

(3) భేదములు:—

త్రివిధా అతివిషా జ్ఞేయా శుక్లా కృష్ణా తథారుణా ।
రసవీర్య విపాకేషు నిర్విశేష గుణాధికా ॥
అతివిషా శుక్లకందా జ్ఞేయా విశ్వా చ భంగురా ।
మాద్రీ చ శిశుభైషజ్య విషరూపా మహౌషధిః ॥
శోఫాపహా తిసారఘ్నీ శుక్లకందా చ సా స్మృతా ।
శ్యామకందా ప్రతివిషా విరూపా ఘుణవల్లభా ॥

అతివస, తెలుపు, నలుపు, ఎరుపు భేదములచే మూడు విధములుగా నుండును. అందు విషగుణము లేనట్టి యతివస రస వీర్యవిపాకములందు మిగుల శ్రేష్ఠమైనదిగ నుండును. వీనిలో తెల్లనిది—విశ్వ, భంగుర, మాద్రి, శిశుభైషజ్య (చంటిపిల్లల రోగములను శమింపజేయునవి), విషరూప (విషప్రాయముగ నుండునది), మహౌషధియను నామములచే వ్యవహరింపబడును. ఇది శోఫను, అతిసారమును పోగొట్టును.

నల్లనిది—విరూప, ఘుణవల్లభ యను నామములచే వ్యవహరింపబడును. ఇది జంగమ విషములకు ప్రతి విషముగా నుండును. ని. సం.

N. B:—ఇందు శుక్ల, కృష్ణాతివిషముల గురించియే చెప్పబడి, అరుణాతివిషను గురించి వదలబడినది. కాని యిందు శుక్లాతివిషకు "విషరూప" యని నామాంతరము చెప్పబడి యుండుటచేతను, కృష్ణాతివిష ప్రతివిషముగ

వర్ణింపబడుటచేతను సామాన్యముగ జంగమ విషమునకు స్థావరవిషమును స్థావరవిషమునకు జంగమవిషమును అన్యోన్యము ప్రతివిషములుగా బనిచేయు ననియగది తంత్రాంతర నిరూపింపబడి యుండుటచేతను మొత్తముమీద శుక్ల-కృష్ణాతివిషలు రెండును విషహారియములుగా దోచుచున్నవి. కావున త్రివిధము లగు నతివిషలలో "నిర్విశేవ గుణాధికా" యని జెప్పబడి యుండుటవలన అరుణాతి విషయే నిర్విషయనియు, నిది పై రెండింటిలో గుణాధిక్యతను గలిగి యుండుననియు గ్రాహ్యమగు చున్నది. అయితే అతివిషయను కందము మొత్తముమీద స్థావరవిషములలో జెప్పిన కందవిషములందొక జాతియని దెలియగలదు.

మరియు, అతివిష "శ్వేత-రక్త-కృష్ణ-పీత" భేదముచే నాలుగు విధములుగా మదనపాల నిఘంటువునందు వర్ణింపబడి, అందు పూర్వ పూర్వముగ గుణములందు శ్రేష్ఠమనియు నిరూపింప బడినది. మ_ని.

(4) అతివిషాశోధనము:—

"అతివిషా...ప్రభృతీనాముష్ణ గోమయజలేన శుద్ధిర్జ్ఞాతవ్యా"

అతివసను గోమయముతో జేర్చి కాచిన వేడినీళ్లతో గడిగినను, లేక, గోమయమునందు నీళ్లుజేర్చి అందు అతివసనుంచి నియమిత కాలమువరకు పాకము జేసినను శుద్ధియగును. సా_కా.

(5) విశేష గుణములు:—

జ్వరమును బోగొట్టును. ధ_ని., మలమును నిరోధించును. బాలురకు ఎల్లవేళల (రోగములందును, ఆరోగ్యమునందును) పథ్యకరముగ నుండును. త్రిదోషములను శమింపజేయును. శో_ని.

(6) ప్రయోగములు:—

1. ఆమాతీసారమునందు అతివిషాప్రయోగము.

"దద్యాత్సాతివిషాం పేయాం సామే సామ్లాం సనాగరాం"

అమాతీసారమునందు అతివసతో సిద్ధముజేసిన పేయను అమరస ద్రవ్యములు, శుంఠి వీనితో జేర్చియిచ్చిన హితము. చ_సూ_అ_2. శ్లో. 22.

2. దీపన పాచనాదులకు అతివిషా ప్రయోగము.

"అతివిషా దీపనీయ పాచనీయ సంగ్రాహక సర్వదోష హరాణాం"

అతివస దీపనపాచనీయాది ద్రవ్యములలో శ్రేష్ఠమైనదిగ నుండును. అనగా — జఠరాగ్నిని వృద్ధిపొందించుటకును, ఆమమును పచింప జేయుటకును, మలము నిరోధింప జేయుటకును, త్రిదోషములను శమింప జేయుటకును అతివస కల్కరూపముగ నుపయోగించిన హితము. చ-సూ-అ-25.

3. మూషికవిషములందు అతివిషా ప్రయోగము.

"పాతస్యాతివిషం కల్కం లిహ్యాన్మాక్షిక సంయుతం"

ఎలుక విషమునందు ప్రతిదినము మధువునందు అతివసను కల్కముగా జేసి తేనెతో సేవించిన విషము శమించును సు-క-అ. 7.

4. విషజుష్టములగు కుంజరాది జంతువులకు అతివిషా ప్రయోగము.

"తత్ర మృగేః గవాదీనాం సర్పిః సాతివిషైః శృతం"

ఆవు మున్నగువాని పాలు, అతివస పిండితో గాచబడిన ఘృతమును పానము చేయించిన విషము శమించును.

5. బాలుర రోగములందు అతివిషాప్రయోగము.

"ఏకాం వా ఽతివిషాం కాస జ్వర చ్ఛర్దిరుపద్రుతం"

బాలురకువచ్చు కాసము, జ్వరము, ఛర్ది యీ వ్యాధులయందు కేవలము అతివస మాత్రము కల్కముగా జేసి యిచ్చిన హితము. వా-ఉ-అ-2. శ్లో. 58.

6. సర్వాతిసారములందు అతివిషా ప్రయోగము.

"శృంగాటస్య త్రయో భాగాః భాగశ్చైకో ఽతివిషాభవః |
తండులోదక సంపీతః సర్వకుక్ష్యామయాపహః"

సర్వాతిసారములందును శృంగాటకము 3 భాగములు, అతివస 1 భాగము వీనిని రెండింటిని గ్రహించి మాత్ర జేసి తండులోదకము (బియ్యపు కడుగు)తో నిచ్చిన హితము. వం-సే.

(7) యోగములు:—

1. అతివిషాదిచూర్ణము—వా-ఉ-బాలరోగ, మాత్ర:—5 యవలు. ఉపయోగములు.—కాసము, జ్వరము, ఛర్ది ఇవి శమించును.

(8) Actions and uses:—Bitter, Stomachic, ophrodisiac tonic and antiperiodic, given during convalscence from such debilitating diseases as, fevers, acute inflammatory affections, etc; used also, in cough, dyspepsia and in diarrhoea depending thereupon, in which case it is given in combination with

aromatics bitters and astringents such as Tinospora, Bonduc-Nuts, Hollarrhena etc. It has been given as an antiperiodic in malarial fevers with some success, but is much inferior to quinine Combined with one Vavding it is given to expel the worms. R. N. Khory. II. P. 3

## స్వానుభవము

నేను అతివసను ప్రత్యేకముగ ఉపయోగించి చూడ లేదు. సువర్ణచూర్ణము మున్నగు మిశ్రమయోగములలో ఉపయోగించు యున్నాను. చరకుని అభిప్రాయము ననుసరించి అతివస దీపనీయము, పాచనీయము, సంగ్రాహి, సర్వదోష హర ద్రవ్యములలో శ్రేష్ఠమని చెప్పబడియున్నది. శార్ఙ్గధర సంహితయందు రక్తాతిసారమునందు అనేక కషాయములలో అతివస చేరియున్నది. మధ్యమఖండం 54, 55, 58, 60, 66 చూడుడు. పిల్లలకు ఇండ్లలో తల్లులు ఉపయోగించు మూలికలలో ఇది యొకటి. ప్రత్యేకముగాకూడ ఉపయోగించి అనుభవమును సంపాదింపవలసిన ద్రవ్యము. (ఆ. ల.)

# 7

# అమ్లవేతసం – పుల్లప్రబ్బలిచెట్టు.

హిందీ—అమలవేత, మరాఠి—చుకా, గుజరాతీ—అమలవేత, మలయాళం—కొడుక్కాపులి, కర్ణాటకం—హుళి, ద్రావిడం—కడుక్కాపులి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Palmae

పుల్లప్రబ్బలి కుటుంబము—Zalacca Edulis

Lushington లో 3222 నెంబరున సామాన్యమగు యెత్తుగా పెరుగు తీగయనియు, మలయద్వీపములయందు పెరుగుననియు, వ్యవసాయము చేసిగూడ పెంచుదురనియు, చెప్పబడి యున్నది. పుల్లప్రబ్బలి యను నామాంతరము ఇందుగలదు. 3222 - Alternately fascicled Piunate Dwarf Rattan; Wallich's Edifle Dwarf Rattan.

(వస్తుగుణప్రకాశికాకారుడు Rumex Vesicarius అని వర్ణించియున్నాడు. 698 పుట చూడు. బజారులలో ఎండిపోయిన తప్పలుగానున్న చింతపండువలె ఒకరకమును, వెంట్రుకజడవలె జడలుగా వేశి మరియొకరకమును పుల్లని రుచిగల పండు ఒరుగు సంబంధమయినవి రెండురకము లమ్ముచున్నవి. లషింగ్టన్‌లో జలాకా ఎడ్యూలిస్ Zalacca Edulis (Wall) అనుపేరుకింద ఇతరదేశమునుండి యీ దేశమునకు వచ్చిన తీగెగా వర్ణించియున్నాడు. కొందరు మహావృక్షమనుచున్నారు. (Palmae) తాళకుటుంబమునందు వర్ణించియున్నాడు. ఇంకను పరిశోధన చేయవలెను. పేముజాతికి సంబంధించియున్నది. కొందరు Rnmex - Crispus; కొందరు శాకములలో జేరిన Rumex Viscarius అమ్లవేతసము అని తలచుచున్నారు. ఈ ప్రాంతమున దానియుపయోగము లేదు. ఆ. ల.)

## పర్యాయపదములు

శ్లో॥ స్యా దమ్లవేతసం చుక్రం శతవేధి సహస్రభిత్ ॥

అమ్లవేతసము, చుక్రము, శతవేధి, సహస్రభిత్తు అనునవి యమ్లవేతస నామములు.

## అమ్లవేతసఫలగుణములు

శ్లో॥ అమ్లవేతస మత్యమ్లం భేదనం లఘు దీపనం।
హృద్రోగ గుల్మ శూలఘ్నం పిత్తలం రోమహర్షణం ॥

రూక్షం విణ్మూత్రదోషఘ్నం ప్లీహోదావర్తనాశనం ।
హిక్కానాహారుచి శ్వాసకాసాజీర్ణవమిప్రణుత్ ॥
కఫవాతామయఘ్నంచ ఛాగమాంస ద్రవత్వకృత్ ॥

వృక్షామ్లవేతసము అధికామ్లరసమును, లఘు రూక్ష గుణములను గలిగి యుండును. మలభేదనము జేయును. జాఠరాగ్నిని వృద్ధి బొందించును. గోమాంసమును గరిగించును. మేకమాంసమును ద్రవపూరితముగ జేయును, పిత్తమును వృద్ధిబొందించును. కఫవాతములను శమింపజేయును. హృద్రోగము, గుల్మము, శూల, విణ్మూత్రదోషము, ప్లీహవృద్ధి, ఉదావర్తము, హిక్క, ఆనాహము, అరుచి, శ్వాస, కాస, అజీర్ణము, వాంతి యీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— (రక్తసార, అమ్లనాయక, శంఖద్రావి, మాంసద్రావి, మహాక్షార). (ఖ) గుణబోధకములు:— శతవేధి, సహస్రభిత్తు, (రసామ్ల, భేదన, గుల్మకేతు, హృద్యము, అస్థిద్రావి, శూలనుత్తు.)

(2) శబ్దార్థములు:—

రక్తసార—ఎఱ్ఱని సారముగలది. అమ్లనాయక—అమ్లరసముగల వృక్షములలో శ్రేష్ఠమైనదిగ నొప్పునది. శంఖద్రావి—శంఖమును ద్రవింప జేయునది (లేక) మాంసమును జీర్ణింపజేయునది. మహాక్షార—విశేషముగ క్షారమును గలది. శతవేధి—సహస్రభిత్తు—అనేకమైన వ్యాధులను బోగొట్టునది. రసామ్ల—అమ్లరసముగలది. భేదన—మలాదులను భేదించునది. గుల్మకేతు—గుల్మమును బోగొట్టునది. హృద్యము—హృదయమునకు హితమైనది. అస్థిద్రావి—ఎముకలను ద్రవింపజేయునది (లేక) జీర్ణింపజేయునది. శూలనుత్తు—శూలను బోగొట్టునది.

(3) భేదములు:—

ఇది పెద్ద—చిన్న భేదముచే రెండు విధములుగా నుండునని సాలిగ్రామ నిఘంటుకారునిచే జెప్పబడినది. కాని వీనిని గురించిన వివరము లెచ్చటను గానరావు. ఇది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి అమ్లరసయుత ఫలవర్గములో గణింపబడు చున్నది. చరకాచార్యునిచే "అమ్ల

వేతసం భేదనీయ దీపనీయ - అనులోమిక వాతశ్లేష్మ ప్రశమనానాం" (చ సూ-అ.25.సూ.42.) అమ్లవేతసము మలభేదనము చేయుటయందును, జఠరాగ్నిని వృద్ధి బొందించుటయందును, వాతాదుల కనులోమనగతి గలిగించుట యందును, వాతశ్లేష్మములను శమింప జేయుటయందును బ్రశస్తమైనదిగా పరిగణింపబడినది. ఈ వృక్షములు సింహళద్వీపమునందు విశేషముగా పెరుగునని సాలిగ్రామ నిఘంటుకారకుడు నిరూపించియున్నాడు. ఈ వృక్షము లెక్కడ యుత్పత్తి యైనను వీని నిజస్వరూప మెవ్వరికిని తెలియకున్నది. మరియుబజారులందు వీని ఫలములంపలి గుజ్జు మాత్రమే లభించుచున్నది. పై పదములను బట్టి యిది శంఖాదులను ద్రవింపజేయుననియు, మాంసాదులను సులభముగా జీర్ణింప జేయుననియు దెలియగలదు. శతవేధి, సహస్రవేధి యను పదములను బట్టి యిది దోషములను అనేక విధములుగా లేఖనము చేసి బయటకు వెలిబరచునని దెలియగలదు. మొత్తముమీద నీ ఔషధము గుల్మాది వ్యాధులందు మిగుల శ్రేష్ఠమైనదిగా నెంచవచ్చును. అమ్లరసము, షడ్రసము లందు హితమైనదిగా నిరూపింపబడినను అమరస యుక్తమగు నీ యమ్లవేతసము పైని జెప్పినట్టి శ్రేష్ఠములగు గుణములతో గూడియుండుటచేసి యమ్లరస యుక్త ద్రవ్యములందు హితమైనదిగ గ్రహింపబడు చున్నది. మరియు నిది రసాయనముగ గూడ బ్రయోగింపబడు చున్నట్లు దెలియగలదు.

(4) విశేషగుణములు:—

(క) అమ్లవేతస ఫల సామాన్య—కషాయరసమును, కటుకానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. తృష్ణను, క్రిములను అర్శస్సును, అశ్మరిని బోగొట్టును. ధ-ని.

(ఖ) ఆమఫలము—అత్యమ్లరసమును గలిగి యుండును. కఫవాతములను శమింపజేయును. ఆనాహమును బోగొట్టును. రా-వ.

(గ) పక్వఫలము—గురుగుణమును గలిగియుండును. మలాదులను నిర్హరించును. త్రిదోషములను శమింపజేయును. శ్రమనుబోగొట్టును. రా-వ.

(ఘ) అమ్లవేతసకల్పము:—

"గుల్మీ పిబే దరిష్టేన మందాగ్ని ర్మధునా యుతం।
కోలాంభసా ఉరోగ్లపికారీ ఘృతేన తు జలోదరీ॥
అశ్మర్యాం దధిమండేన ప్రమేహీ శీతవారిణా।

[illegible] మూత్రేణ తు ప్లీహ్నే వాతే యూషరసేన తు ॥
సుఖోష్ణేనాం భసా శూలే పయసా క్షీణరేతసి॥"

పుల్లప్రిబ్బలి ఫలరసమును అరిష్టముతో సేవించిన గుల్మమును, తేనెతో సేవించిన అగ్నిమాంద్యమును, రేగుపండ్లరసముతో సేవించిన అర్శస్సును, ఘృతముతో సేవించిన జలోదరమును, దధిమండముతో సేవించిన అతిసారమును, తిలలతో సేవించిన ప్రమేహమును, గోమూత్రముతో సేవించిన ప్లీహవృద్ధియు, యూషరసముతో సేవించిన వాతరోగమును, గోరువెచ్చని జలముతో సేవించిన శూలయును, పాలతో సేవించిన శుక్రక్షైణ్యమును బోవును. గ_ని.

(చ) అమ్లవేతస రసాయనకల్పము__

"పుణ్యేఽహని సునక్షత్రే కాలే నాత్యుష్ణశీతలే ।
సుసంతుష్టశరీరస్తు పిబేత్ కర్షార్ధమాదితః ॥
తతోఽష్టరాత్రాత్తు పరం కర్షార్ధ వివర్ధితం ।
పలం క్షీరయుతం మాసం క్షీరవృత్తి రనన్నభుక్ ॥
ఏషః ప్రయోగః పుష్ట్యాయు ర్బలారోగ్యకరః పరః ।
రూప యౌవన సౌభాగ్య శోభాకాంతి సుఖప్రదః ॥
నాతః పరతరం కించిత్ శ్రేష్ఠ మస్తి రసాయనం ।
దృష్టం గుల్మార్శసా మాశు భేదనం పరమౌషధం॥"

ఊర్ధ్వాధశ్శుద్ధశరీరుడై అధికోష్ణ శీతలములుగా నట్టి కాలమున శుభనక్షత్రాది యుక్త దినమున పుల్లప్రిబ్బలిఫల రసమును ఒకటిన్నర తులము ప్రమాణమును గ్రహించి పాలయందు గలిపి సేవించవలెను. ఇటుల ఎనిమిది రోజులు సేవించిన పిమ్మట తిరిగి మరియొక అరతులము ప్రమాణమును హెచ్చించి పై విధముగనే సేవించవలెను. ఇటుల నొక ఫలము వరకును ప్రమాణమును హెచ్చించుచు నొక మాసము అన్నము లేకుండగ కేవల క్షీరమును మాత్ర మాహారముగా దీసికొనుచు సేవించిన పుష్టి, ఆయుష్షు, బలమును, ఆరోగ్యమును వృద్ధిఁగాంచును. రూపయౌవనాది సంపత్తి గలుగును. దీనిని మించిన రసాయన ప్రయోగము మరియొకటి లేదు. మరియు గుల్మము, అర్శస్సును నిశ్చయముగా బోవును. గ_ని.

(5) ప్రయోగములు:—

1. ప్లీహమునం దమ్లవేతస ప్రయోగము.

"అమ్లవేతస సంయుక్తః శిగ్రుకాథః ససైంధవః ।
పీతః ప్లీహోదరం హంతి పిప్పలీ మరిచాన్వితః"

పుల్లప్రబ్బలిపండు, మునగచెక్క వీని కషాయమునందు సైంధవలవణమును, పిప్పలిచూర్ణమును, మరిచచూర్ణమును జేర్చి సేవించిన ప్లీహోదరము శమించును. వం_సే.

(6) యోగములు:—

1. అమ్లవేతసాదిచూర్ణము—వై-చిం-స్వరభేద. మాత్ర:— $\frac{1}{4}$ తులం. ఉపయోగములు:—స్వరభేదము, పీనసము, అరుచి ఇవి శమించును.

స్వానుభవము

అమ్లవేతసము ఈ రాజధానిలో 2 రకములుగా దొరకుచున్నది. రెండును పుల్లగ నుండును. ఏ రకము దొరకిన దానిని భాస్కరలవణమునం దుపయోగించుచున్నాము. చెట్టో తీగో మాకు తెలియదు. మిశ్రమ ఔషధములలో కలిపి వాడుచున్నాము గాని ప్రత్యేకముగా నంత వాడుకలో లేదు. చింతపండుకు బదులు పథ్యముగ నుపయోగింపవచ్చును. కొందరు పుల్లనికూర (శాకము) (Rumex Vesicarius) ను ఇతర ప్రాంతములం దుపయోగించునట్లు తెలియుచున్నది. ఇంకను పరిశోధన చేయవలెను. ఆ. ల.

---

# 8

# అర్జునః - మద్దిచెట్టు. (క)

హిందీ—అర్జున, కోహా, సాజ, సాజద, మరాఠీ—అర్జున, సాగ ఫోల, సాదడీ, గుజరాతీ—సాజడ్, కడాహో, సాజద, మలయాళం—మారుతు, కర్ణాటకం—అర్జున, ద్రావిడం—మరుత్తు.

## నైసర్గిక స్వరూప వర్ణము

### అర్జున - మద్దిచెట్టు

### Natural Order - Combretaceae

### మద్ది కుటుంబము—Termituli Arguna

ఇందు తెల్లమద్ది, నల్లమద్ది, ఏరుమద్ది మూడువిధములుగ నున్నది. ఈ కుటుంబములో మద్దిగాక కరక్కాయిచెట్టు, బాదముచెట్టు తాండ్లచెట్టు, తాండ్రిచెట్టు, చిరుమాను, నెమిరి, వెల్లనాగ, కాంచనచెట్టు, బొడ్డుతీగె, బండిమురుదుడు గలవు. ఇది పలుతావుల పెరుగుచెట్టు.

ఆకులు:—కొంచెము ఇంచుమించు అభిముఖచేరిక, పైనున్నవి ఒంటరిచేరికయే. లఘుపత్రములు, సమగోళాకారము—అండాకారము. అడుగున రోమములుండును. సమాంచలము. విషమరేఖపత్రిము. కొనసన్నము. తొడిమ చివర గ్రంధికోశములు గలవు.

పుష్పమంజరి:—కణుపుసందుననుండి రెమ్మకంకులు. మిధునపుష్పములు, ప్రతిపుష్పపద్దను ఒకచేటిక గలదు.

పుష్పకోశము—సంయుక్తము, గొట్టమువలెనుండును. అండాశయమున కంటుకొనుగు తమ్మెత్రిభుజాకారము, ఒకదానినొకటి తాకుచుండును. దళవలయములేదు.

కింజల్కములు:—10. పుష్పకోశమునంటి యున్నవి. వీనిమధ్య నొక పళ్లెరము గలదు.

అండకోశము—అండాశయము నీచము. ఒకగది. రెండో మూడో అండములు వ్రేలాడుచుండును.

ఈ కుటుంబములో పెద్దచెట్లును గుబురుమొక్కలును గలవు. ఆకులు, లఘుపత్రములు, పువ్వులు. మిధునపుష్పములేగాని కొన్నిటిలో ఆకర్షణపత్రములులేవు. కొన్ని పువ్వుల పుష్పకోశపు తమ్మెలు అల్లుకొని యుండును, కొన్నిటివి తాకుచుండును; అండాశయము నీచము, ఒకగది, కొన్నిటిలో నొకగింజయే కలదు. మరికొన్నిటిలో నంతకంటె నెక్కువయుండును. పుష్పకోశములయొక్క తమ్మెలను బట్టియు గింజలసంఖ్యను బట్టియు నీకుటుంబమును జాతులుగను తెగలుగను విభజించియున్నారు.

నల్లమద్ది:—దీనికలప మిక్కిలి బలమైనది. ఇండ్లదూలములు ముస్నగువాటికి మిక్కిలి గావాడుచున్నారు. ఈ చెట్ల బెరడు, కాయలు, తోళ్లకు రంగువేయుటకును వాడెదరు. బెరడును ఔషధములకు వాడెదరు. దీనియాకులను పట్టుపురుగులు తినును.

తెల్లమద్ది:—చెట్లు సాధారణముగ నీటివారపెరుగును. దీని యాకులు సన్నముగ నిడివి చౌకముగను, నున్నగను ఉండును. పై చెట్టువలె నిదియు నుపయోగించును. ఏఱుమద్ది చెట్టును పెద్దదియే. దీనికొమ్మలు అడ్డముగా వ్యాపించును.

## పర్యాయపదములు

శ్లో॥ కకుభోఽర్జుననామాఖ్యో నదీసర్జశ్చ కీర్తితః ॥
ఇంద్రద్రుర్వీరవృక్షశ్చ వీరశ్చ ధవలః స్మృతః ॥

కకుభము, అర్జుననామ, నదీసర్జము, ఇంద్రద్రుమ్రివు, వీరవృక్షము, వీర, ధవలము అనునవి అర్జుననామములు.

## అర్జున గుణములు

శ్లో॥ కకుభః శీతలోః హృద్యః క్షతక్షయ విషాస్రజిత్ ।
మేదోమేహవ్రణాన్ హన్తి తువరః కఫ పిత్తహృత్ ॥

మద్దిచెట్టు కషాయరసమును, శీతవీర్యమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. కఫపిత్తములను శమింపజేయును. క్షతక్షయము, విషము, రక్తదోషము, మేదోవృద్ధి, ప్రమేహము, వ్రణము అను నీ వ్యాధులను బోగొట్టును.

## సాలః - నల్లమద్దిచెట్టు (ఖ)

శ్లో॥ సాలస్తు సర్జకార్శ్యశ్చాశ్వకర్ణకః । సస్యసంబరః ॥

సాలము, సర్జము, కార్శ్యము, అశ్వకర్ణకము, సస్యసంబరము అనునవి సాల నామములు.

## సాల గుణములు

శ్లో॥ అశ్వకర్ణః కషాయః స్యాత్ వ్రణస్వేదకఫకృమీన్ ।
బ్రధ్న విద్రధి బాధిర్య యోని కర్ణ గదాన్ హరేత్ ॥

నల్లమద్దిచెట్టు కషాయరసమును గలిగి యుండును. కఫమును శమింపజేయును. వ్రణము, అతిస్వేదము, కృములు, బ్రధ్నము, విద్రధి, బాధిర్యము, యోనిరోగములు, కర్ణరోగములు అను నీ వ్యాధులను బోగొట్టును.

## రాలః - సర్జరసము (లేక) సాలనిర్యాసము

శ్లో॥ రాలస్తు సాలనిర్యాసః తథా సర్జరసః స్మృతః ।
దేవధూపో యక్షధూపస్తథా సర్వరసశ్చసః ॥

రాలము, సాలనిర్యాసము, సర్జరసము, దేవధూపము, యక్షధూపము, సర్వరసము అనునవి రాలనామములు.

## రా ల గు ణ ము లు

శ్లో॥ రాలో హిమో గురు స్తిక్తః కషాయోగ్రాహకో హరేత్ ।
దోషాస్రస్వేద వీసర్ప జ్వర వ్రణ విపాదికాః ॥
గ్రహ భగ్నా గ్నిదగ్ధా శ్రిశూలా తీసారనాశనః ॥

సర్జరసము తిక్తరసమును, కషాయానురసమును, గురుగుణమును శీత వీర్యమును గలిగియుండును. మలాదుల నిరోధించును. రక్తదోషము, అతి స్వేదము, విసర్పము, జ్వరము, వ్రణము, విపాదిక, గ్రహదోషము, భగ్న వ్రణము, అగ్నిదగ్ధవ్రణము, అలక్ష్మి, శూల. అతీసారము అను నీ వ్యాధులను బోగొట్టును.

## సర్జకః - ఎఱ్ఱమద్దిచెట్టు (గ)

శ్లో॥ సర్జకోఽన్యోఽజకర్ణః స్యాత్ సాలో మరిచపత్రకః ॥

సర్జకము, అజకర్ణము, సాలము, మరిచపత్రికము అనునవి సర్జక నామములు.

## స ర్జ క గు ణ ము లు

శ్లో॥ అజకర్ణః కటు స్తిక్తః కషాయోష్ణో వ్యపోహతి ।
కఫపాండు శ్విత్రగదాన్ మేహకుష్ఠవిషవ్రణాన్ ॥

ఎఱ్ఱమద్దిచెట్టు కటురసమును, తిక్తకషాయా నురసములను, ఉష్ణవీర్యమును గలిగియుండును. కఫమును శమింపజేయును. పాండు, కర్ణరోగము, ప్రమేహము, కుష్ఠము, విషము, వ్రణము అను నీ వ్యాధులను బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— (అర్జున)—కకుభము, ఇంద్రద్రుమ్రు, వీరవృక్షము, ధవలము, (సాల)— సాలము, అశ్వకర్ణకము, సస్యసంహారము,

(దీర్ఘశాఖి, వల్లీవృక్షము, గంధవృక్షక. దివ్యసార.) - (రాల) - సాలనిర్యాసము, సర్జరసము, సర్వరసము, (వహ్నివల్లభ. సురభి.) (సర్జక) - సర్జకము, అజకర్ణము, సాలము, మరిచపత్రికము. (ఖ) గుణబోధకములు:— (సాల) - కార్శ్యము, (కషాయము), (రాల)-రాలము, యక్షధూపము, దేవధూపము. (గ) ఉత్పత్తిబోధకములు:— (అర్జున) - నదీసర్జము.

(2) శబ్దార్థములు:—

కకుభము—నలుదిక్కులకు విశాలముగ వ్యాపించునది. ఇంద్రద్రుమ—వృక్షములలో శ్రేష్ఠమైనది. వీరవృక్షము - వృక్షములలో వీరునివలె ప్రకాశించునది. ధవలము - తెల్లని వర్ణముతో గూడియుండునది. సాలము_సారము గలదగుటచే దృఢముగ నుండునది. అశ్వకర్ణకము - గుఱ్ఱపు చెవులవంటి పత్రములను గలది. సస్యసంవరము - సస్యముల (చేలు)చే చుట్టును ఆవరింపబడియుండునది. దీర్ఘశాఖి - పొడవుగనుండు కొమ్మలతో నొప్పియుండునది. వల్లీవృక్షము - లతలచే వ్యాప్తమై యుండునది. గంధవృక్షక - పరిమళించునది. దివ్యసార - దేవతలకు ధూపము వేయుటకై నుపయోగించునట్టి సారము గలది. సాలనిర్యాసము - సర్జరసము - సాలవృక్షముయొక్క బంక. సర్వరసము - ఎల్లరచే భుజింపబడునది. వహ్నివల్లభ - అగ్నికి ప్రియకరమైనది. సురభి - పరిమళించునది. సర్జకము - ఒక విధమగు నిర్యాసమును విడుచునది. అజకర్ణము - మేక చెవులవంటి పత్రములను గలది. సాలము - సారముగలది. మరిచపత్రికము - మిరియముల పత్రములవంటి పత్రములనుగలది. కార్శ్యము-లేఖనము జేయునది. కషాయము _ కషాయరసముగలది. రాల_దుఃఖములేకుండ జేయునది. యక్షధూపము - యక్షులకు ధూపముద్వారా సంతాపము గలిగించునది. దేవధూపము - దేవతలకు ధూపముద్వారా సంతాపము గలిగించునది. నదీసర్జము - విశేషముగ నదులయొడ్డున నుత్పత్తి యగునది.

(3) పరిచయబోధక లక్షణము:—

(క) అర్జున:—

"అర్జునస్త్వగ్రిపత్రస్తు శ్వేతవాహో మహీరుహః ।
క్షీరకషాయః పీతాభో భంగీ కర్షఫలపృథుః ॥
కపీతనోపమేషా రూపే భవతి కానసే గిరౌ ॥

మద్దిచెట్టు తెల్లని వర్ణముతోగూడి మిగుల నెత్తుగ బెరిగి చిగురు భాగములందు పత్రములను గలిగియుండును. దీని క్షీరము కషాయరసమును

పచ్చని వర్ణమును గలిగియుండును. దీని ఫలములు కర్షమంత బరువుగలిగి యుండును. ఇది యుదుంబర వృక్షమును బోలి యడవులందును, పర్వతము లందును వృద్ధి పొందుచుండును. శి-ఖ.

(ఖ) సర్జక:—

"బస్తకర్ణః పీతఫలో కషాయో గంధవృక్షకః"

ఎఱ్ఱమద్ది చెట్టు మేక చెవులవంటి యాకులతోను, పసుపుపచ్చని వర్ణము గల పండ్లతోను ఒప్పి యుండును. ఇది కషాయరసమును, పరిమళమును గలిగి యుండును. శా-ని.

(4) భేదములు:—

ఇది తెలుపు, నలుపు, ఎఱుపు అని వర్ణభేదముచే మూడు విధములుగ నుండునట్లు గానబడును. ఇవి మిగుల నున్నతముగ బెరుగు వృక్షజాతులలో నుత్పత్తిగలిగి సార సారములలో గణింపబడు చున్నవి. ఇందు తెల్లమద్ది చెట్టు ఎల్లచోట్లను బెరుగును గాని మిగిలినవి యడవులందే బెరుగునట్లు దెలియ గలదు. వీటి మాను మిగుల దృఢముగ నుండి యివి యెత్తుగా బెరుగునవి యగుటంజేసి మహాకవులు కావ్యములలోని వీరపురుషులను ఈ వృక్షములతో పోల్చి వర్ణించినట్లు గానబడును. ఇవి కషాయరసమును గలవగుటచే స్తంభన క్రియ కుపయోగింప బడుచుండును. మరియు హృదయవ్యాధులందివి మిగుల గుణదాయకములుగ నున్నట్లును దెలియగలదు. ఇందలి సాలవృక్షముయొక్క నిర్యాసమే సర్జరసముగా వ్యవహరింప బడుచున్నది. ఇది కొంచెము పసుపు పచ్చని వర్ణము గలిసిన తెల్లని వర్ణమును గలిగి చిన్న చిన్న ముక్కలుగా బజారులందు దొరకుచుండును. అయితే దీనిని మెత్తగా చూర్ణించినప్పుడు స్వచ్ఛముగ తెల్లని వర్ణముగనే యుండును. ఇది స్నిగ్ధ పిచ్ఛిల గుణములను గలిగి పరిమళముతో గూడి యుండును. వ్రణములందు విశేషముగా నగ్ని వ్రణములందు నిది యుపయోగింపబడు చున్నది. మరియు నితర గుటికా యోగములందు గూడ దీనిని ప్రయోగించుటయు గలదు. అయితే నిందలి వృక్షములలో నొక్క సాలవృక్షనిర్యాస (సర్జరస)మే గ్రహింపబడినది, గాని మిగిలినవి గూడ సారవృక్షములే యైనను వాని నిర్యాసము లేల గ్రహింపబడ లేదో తెలియకున్నది.

(5) విశేషగుణములు:—

(క) అర్జున–ఉష్ణవీర్యమును గలిగి యుండును. వ్రణమును శోధించును. వాతమును వృద్ధిపొందించును. శ్రమను, తృష్ణను బోగొట్టును. రా_ని. రక్తమును స్తంభింపజేయును. అస్థిభగ్నమును, మూత్రకృచ్ఛ్రమును బోగొట్టును. రా_వ. మధురానురసమును, లఘుగుణమును గలిగి యుండును. కాంతిని బలమును గలుగజేయును. దాహము, పాండు, అతిస్వేదము, శ్వాస వీనిని బోగొట్టును. ని_ర.

(ఖ) సాల–రక్తదుష్టిని బోగొట్టును. గ_ని. కటురసమును, తిక్తానురసమును, స్నిగ్ధగుణమును గలిగి యుండును. రక్తపిత్తమును, ఉరశ్శూలలను, దురద, శిరశ్శూలలను బోగొట్టును. రా_ని. ఉష్ణవీర్యమును గలిగి యుండును. ప్రమేహమును, కుష్ఠమును బోగొట్టును. ని_ర.

(గ) సాలఫలము–మధురరసమును, కషాయానురసమును, రూక్షగురుగుణములను, శీతవీర్యమును గలిగి యుండును. స్తంభనము జేయును. మలమును నిరోధించును. లేఖనమును, ఆధ్మానమును, శూలను గలిగించును. వాతమును వృద్ధిపొందించును. పిత్తమును శమింపజేయును. రక్తదోషమును, తృష్ణను, దాహమును, క్షతక్షయమును బోగొట్టును. ని_ర.

(ఘ) సర్జరసము–మధురరసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. స్తంభనము జేయును. వ్రణరోపణము జేయును. ధ_ని. స్నిగ్ధగుణమును గలిగి యుండును. వాతపిత్తములను శమింప జేయును. కండువును, స్ఫోటములను బోగొట్టును. రా_ని.

(చ) సర్జరసతైలము–విస్ఫోటమును, వ్రణము, కుష్ఠము, పామ, కృములు, వాతజవ్యాధులు, శ్లేష్మజవ్యాధులు వీనిని బోగొట్టును. ఆ॥సం.

(ఛ) సర్జకము–స్నిగ్ధగుణమును ఉష్ణ శీత వీర్యములను గలిగి యుండును. వాత పిత్తములను శమింప జేయును. అతిసారమును, రక్తదోషమును, దురద, విస్ఫోటమును బోగొట్టును. రా_ని. మలాదులను నిరోధించును. దగ్ధవ్రణమును బోగొట్టును. భా_ని.

(6) ప్రయోగములు:—

(క) అర్జున—

1. రక్తపిత్తమునందు అర్జునప్రయోగము.

"ధనంజయోదుంబర......నిశిసిత్వా
స్వరసీకృత్వా వృదిత్వాః శృత్వా
ఏతే సమస్తాః గణాః పృథగ్వారక్తం సపిత్తం శమయింతయోగాః"
మద్ది, మేడి మొదలగువాని పట్టలను అన్నింటిని గాని, ప్రత్యేకముగ గాని, గ్రహించి జలియగొట్టి కల్కముగ గాని, కషాయముగాని గాచి, రాత్రి జలమునం దూరబెట్టి గ్రహించినట్టి స్వరసమును గాని, పచ్చిగ నున్నప్పుడు మెత్తగా నూరి గ్రహించినట్టి స్వరసమును గాని, కల్కముగాజేసి గాని సేవించిన రక్తపిత్తమును శమింప జేయును. చ_చి_అ. 4.

2. వ్రణమునందు అర్జున ప్రయోగము.

"అర్జునస్యపత్రం......వ్రణప్రచ్ఛాదనే విద్యానాదితేత్"
మద్దియాకును వ్రణములపై నాచ్ఛాదనముజేసిన హితము. చ_చి_అ 13.

3. అర్శోరోగమునందు అర్జున ప్రయోగము.

"పరిషేచనే నిదధ్యాత్ వృష కకుభ యవాస నింబాశ్చ"
మద్దిపట్ట మొదలైనవాని కషాయమును గోరువెచ్చగ నున్నప్పుడు అర్శోరోగియొక్క శూలతోగూడిన అర్శస్సులందు సేచనము జేసిన శూల శమించును. చ_చి_అ 9.

4. కుష్ఠమునందు అర్జునప్రయోగము.

"ఖదిరా వఘాత కకుభా...శస్యంతే స్నాన పానేషు"
చండ్రి, మద్ది వీని పట్టల కషాయమును కుష్ఠమునందు స్నానపానముల నుపయోగించిన హితము. చ_చి_అ 7.

5. శుక్రమేహమునందు అర్జున ప్రయోగము.

"శుక్రమేహినం కకుభచందన కషాయంవా"
మద్ది, చందనము వీని కషాయమును సేవించిన శుక్రమేహము శమించును.
సు. చి_అ. 11.

6. మూత్రాఘాతమునందు అర్జున ప్రయోగము,

"కషాయం కకుభస్యవా"
మద్దిచెక్క కషాయమును సేవించిన మూత్రాఘాతము శమించును.
వా_చి_అ. 11.

7. మూఢగర్భమునందు అర్జున ప్రయోగము.

"శిరీష కకుభ క్వాథ పిచూన్ యోనౌ వినిక్షిపేత్ ।
ఉపద్రవాశ్చ యేఽన్యేస్యుస్తాన్ యథాస్వముపాచరేత్" ॥

దిరిశనపట్ట, మద్దిపట్ట వీని కషాయమునందు తడిపిన పిచువులను మూఢ గర్భమును బయటకు దీసినపిమ్మట సూతికయొక్క యోనిముఖము నందుంచిన యెడల మూఢగర్భమును బయటకు దీయుటయందు గలిగిన వికారములు శమించును. వా-శా-అ 2.

8. వ్యంగమునందు అర్జున ప్రయోగము.

"వ్యంగేషుచార్జునత్వగ్వా"

మద్దిపట్టను మెత్తగానూరి లేపనము జేసిన వ్యంగము శమించును.

వా-ఉ-అ. 32. శ్లో. 16.

9. హృద్రోగమునందు అర్జున ప్రయోగము.

"అర్జునస్య త్వచాసిద్ధం క్షీరంయోజ్యం హృదామయే ।
సితయా పంచమూల్యావా బలయా మధుకేనవా" ॥

మద్దిచెక్క కషాయముతో గాచిన పాలయందు చక్కెరను గాని, పంచమూల చూర్ణమును గాని, యష్టిమధుక చూర్ణమును గాని జేర్చి సేవించిన హృద్రోగము శమించును. బృంద.

10. భగ్నమునందు అర్జునప్రయోగము,

"భగ్నః పిబేత్త్వక్ పయసార్జునస్య"

మద్దిచెక్క చూర్ణమును పాలతో సేవించిన యస్థిభగ్నము శమించును.

బృంద.

11. రక్తాతిసారమునందు అర్జున ప్రయోగము.

"అర్జునత్వాచా । పీతాః క్షీరేణ మధ్వాఢ్యాః
పృథక్ శోణితవారణాః" ॥

మద్దిపట్ట చూర్ణమును తేనెతో గలిపి పాలతో సేవించిన రక్తాతిసారము శమించును. బృంద.

12. క్షయకాసమునందు అర్జున ప్రయోగము.

"చూర్ణం కాకుభమిష్టం వాసక రస భావితం బహువారాన్ ।
మధు ఘృత సితోపలాభిః లేహ్యం క్షయ కాస రక్తహరం" ॥

మద్దిచెక్క చూర్ణమును అడసరపాకు రసముచే ననేకమార్లు భావన జేసి అది తేనె, నెయ్యి, కలకండచూర్ణము వీనిని జేర్చి బాగుగా గలిసి సేవించిన రక్తముతో గూడిన క్షయకాస శమించును. భా-ప్ర.

13. పూయమేహమునందు అర్జున ప్రయోగము.

"పూయమేహే కషాయశ్చ ధవార్జునస్య"

మద్ది, ధవవృక్షము. వీనియొక్క పట్టల కషాయమును సేవించిన పూయమేహము శమించును, హా.సం.

(ఖ) సాల—

1. రసాయనమునకు సాల ప్రయోగము.

"ఘనాశ్వకర్ణాసన బాలపత్రసారా స్తథా పిప్పలివ త్ప్రయోజ్యాః
లోహోపలిప్తాః పృథగేవజీవేత్ సమాః శతం వ్యాధిజరావిముక్తః"

నల్లమద్ది సారమును లోహపాత్రకు బూసి యథావతుగ పిప్పలీ రసాయన సేవనావిధ ననుసరించి సేవించినచో జరావ్యాధులు లేక నూరువర్షములు సుఖముగ జీవించును. వా-ఉ-అ. 39.

(7) యోగములు:—

(క) అర్జున— 1. అర్జునఘృతము—భైషజ్య-హృద్రోగ. మాత్ర:— 1 తులం. ఉపయోగములు:—హృద్రోగము శమించును.

2. కకుభాది చూర్ణము—భైషజ్య-హృద్రోగ. మాత్ర:—$\frac{1}{4}$ తులం. ఉపయోగములు:— హృద్రోగము శమించును.

3. అర్జునారిష్టము—భైషజ్య-హృద్రోగ. మాత్ర:—1 ఔన్సు. ఉపయోగములు:— హృద్రోగము, పుప్ఫుసరోగము ఇవి శమించును. బలమును, వీర్యమును గలుగును.

4. అర్జునాది ఘృతము—భా-ప్ర-ప్రమేహ. మాత్ర:—1 తులం. ఉపయోగములు:—పిత్తజప్రమేహములు శమించును.

(ఖ) సాల—1. సాలసారాది లేహ్యము—భైషజ్య-ప్రమేహ. మాత్ర:—1 తులం. ఉపయోగము:—ప్రమేహము శమించును.

2. సాల వజ్రాదివర్తి—సు-క్షుద్రరోగ. ఉపయోగములు:—ధూమపానముజేసిన కఫ-మారుతజ ముఖరోగములు శమించును.

3. సాలసారాది గణక్వాథము—సు-సూ-అ, 38. మాత్ర:- 1 పలం. ఉపయోగములు:—కుష్ఠము, ప్రమేహము, పాండు ఇవి శమించును. కఫము, మేదస్సు ఇవి శుష్కించును.

(8) Actions and uses:—Astringent and tonic, given in heart diseases. Locally used as a wash for wounds, ulcers, contusions and specially used in promoting union of fractures and dispersion of ecchymosis; internally largely used by the natives in haemorrhagic and other fluxes and as a lithontriptic.

R. N. Khory II p. 258.

Constituents:—The ash of the bark contains 34 per cent pure calcium carbonate. The bark also contains tanin.

Actions and uses (రాళ):-Stimulent and demulcent; the natives use it for fumigating sick rooms. Externally, as a plaster or ointment it acts as a stimulent. A paste of it mixed with brandy and white of eggs is a very useful and soothing application for the relief of lumbago and other rheumatic pains. The natives use the powder of Rala as an astringent application to the relaxed uvula; it has also been tried in dysentery with good results.

R. N. Khory II. p. 86,

### స్వానుభవము.

ప్రాచ్యపాశ్చాత్యులందు దీని యుపయోగమును మిక్కిలి పొగడి యున్నారు. మిశ్రమౌషధములతో బజారులో దొరకు తెల్లమద్దిపట్టను, దంతధావనచూర్ణములో ఎఱ్ఱమద్దిపట్టను ఉపయోగించుచున్నారు. ప్రత్యేకముగ మద్దిపట్ట యొక్క ఉపయోగములను గూర్చి నాకనుభవములేదు (ఆ. ల.)

# 9

# అరిష్టకః - కుంకుడుచెట్టు.

భాషాంతర నామములు

హిందీ—రీఠా, మరాఠీ—రిఠా, రీటా, గుజరాతి—అరీఠా మలయాళం—ఉరింజీ. కర్ణాటకం—అరిఠల, ద్రావిడం—పొన్నలక్.

నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Sapindaceae

కుంకుడు కుటుంబము—Sapindus trifoliatus.

ఈ కుటుంబమునందు లౌటంగచెట్టు, ఉల్లెనతీగె, అరిష్ఠ, విషరాసి, తాటకి, కొరవి యివి చేరియున్నవి.

కుంకుడుచెట్లు మనదేశములో చాలచోట్ల పెరుగుచున్నవి. ఆకులు—మిశ్రమపత్రములు, ఒంటరిచేరిక. కణుపు పుచ్ఛములు లేవు. చిట్టియాకులు మూడో, నాల్గో, అయిదో యుండును. సమాంచలము. విషమరేఖపత్రము. దట్టముగాను బిరుసుగాను నుండును. కొనసన్నము, ఒక్కొక్కప్పుడు ఛినితము.

పుష్పమంజరి:—కొమ్మల చివరనుండి రెమ్మగెలలు. తెల్లని చిన్నపువ్వులు చేటికలు గలవు. పువ్వులకు వాసనలేదు.

పుష్పకోశము:—రక్షక పత్రములు 5 సమముగానుండును. పీచము.

దళవలయము:—5 ఆకర్షణపత్రములు. సమముగానుండును. వీనిపైన రోమములు గలవు.

కింజల్కములు:—8 పొట్టివి. కాడలయడుగున రోమములుగలవు. పుష్పాదితిత్తులు 2 గదుల, కింజల్కముల చుట్టు పళ్లెరముగలదు.

అండకోశము:— అండాశయము ఉచ్చము, మూడు తమ్మెలుగలవు. కీలము 1 గుండ్రము, కీలాగ్రము గుండ్రము. గింజకు బీజపుచ్ఛము లేదు.

ఈ కుటుంబపు చెట్లు ప్రపంచమునందన్నిచోట్లను గలవు. వీనిలో చెట్లు, గుబురు మొక్కలు గాని గుల్మములంతగా లేవు. ఆకులు ఒంటరి చేరిక. కణుపు పుచ్ఛములుండవు. పుష్పము చిన్నది. రక్షకపత్రములు, ఆకర్షణపత్రములు, అయిదేసిగలవు. కింజల్కములు నూరో, పదియో యుండును గాని, అయిదో, పదో, యుండవు. కింజల్కములచుట్టు నొకపళ్లెముగలదు. సాధారణముగ గింజలకు బీజపుచ్ఛములుండుచుండును.

పర్యాయపదములు

శ్లో॥ అరిష్టకస్తు మాంగల్యః కృష్ణవర్ణోఽర్థసాధనః।
రక్తబీజః పీతఫేనః ఫేనిలో గర్భపాతనః॥

అరిష్టకము, మాంగల్యము, కృష్ణవర్ణము, అర్థసాధనము, రక్తబీజము, పీతఫేనము, ఫేనిలము, గర్భపాతనము అనునవి యరిష్టక నామములు.

## అ రి ష్ట క గు ణ ము లు

శ్లో॥ అరిష్టస్తు త్రిదోషఘ్నో గ్రహాభి ద్గర్భపాతనః॥

కుంకుడు చెట్టు గర్భపాతనమును గలుగజేయును. త్రిదోషములను శమింపజేయును. గ్రహదోషమును బోగొట్టును.

## వి శే షాం శ ము లు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:— కృష్ణవర్ణము, రక్తబీజము, పీతఫేనము, ఫేనిలము, (గుచ్ఛఫలము, కుంభబీజకము.) (ఖ) గుణబోధకములు:— అరిష్టకము, అర్థసాధనము, గర్భపాతనము.

(2) శబ్దార్థములు:—

కృష్ణవర్ణము - నల్లని వర్ణముగల బీజములను గలది. రక్తబీజము - ఎర్రని యంకురములను గలది. పీతఫేనము - ఫేనిలము - పసుపుపచ్చని నురుగును గలది. గుచ్ఛఫలము - గుత్తులు గుత్తులుగ ఫలించునది. కుంభబీజము - భాండము యొక్క ఆకృతిగల బీజములను గలది. అరిష్టకము - వ్యాధులనుండి యుపద్రవములను లేకుండ జేయునది. అర్థసాధనము - కోరిన యుపయోగము సాధించునది. (దేనికై యుపయోగింపబడునో దానిని బయటకు తొలగించు రూపమున ప్రయోగమును సిద్ధింపజేయునది.) గర్భపాతనము - గర్భపాతనమును గలిగించునది.

(3) పరిచయబోధక లక్షణము:—

"అరిష్టకో గుచ్ఛఫలో సర్వతిక్తశ్చ మంజరీ"

కుంకుడు చెట్టు గుత్తులు గుత్తులుగ కాయలను గలిగి సర్వాంగము లందును తిక్తరసముతో నొప్పియుండును. ఈ కాయలు పండి బాగుగాఎండి నప్పుడు ఒక విధమగు ధ్వనిని గలిగి యుండును శి.ద.

N. B:— కుంకుడు చెట్టు ఎత్తుగా బెరుగు వృక్షజాతులలో నెప్పటి గలిగి తిక్తరస ద్రవ్యములలో గణింపబడు చున్నది. ఈ వృక్షము మెల్లోటుల నుత్పత్తి యగుచు. దీని యాకులు కొంచెము నిడుపుగను గుండ్రముగ

నుండును, కొంచెము హెచ్చు తక్కువగా జీడిమామిడి యాకులను బోలి యుండునని జెప్పవచ్చును. కాని యీ యాకులు మిగుల ఖరత్వమును గలిగి యుండును. పువ్వులు పసుపుపచ్చగ నుండును. కాయలు గుత్తులు గుత్తులుగా నుత్పత్తియై బాగుగా నెదిగినప్పుడు ద్రాక్షకాయలంత పరిమాణమును గలిగి యుండును. పండినప్పుడివి యెఱ్ఱగా నుండును. ఇట్టి సమయములో నీ కాయలను గోసి ఎండించి విక్రయించు చుందురు. ఎండినప్పుడు కొంచెము నలుగ నుండును. ఈ చెట్టుయొక్క అంగము లన్నిటికంటె దీని ఫలములకు విశేష ప్రయోగ మున్నట్టుల గానుపించును. వీనిని మెత్తగా నలియగొట్టి నీటిలో వేసి రుద్దినచో కొంచెము తెలుపు గలసిన పచ్చని నురుగువచ్చును. ఇందుచే విశేషముగా నభ్యంగము జేసినప్పుడు ప్రతివారును ఈ కాయల రసముతో శరీరమును రుద్దుకొని స్నానము జేయుదురు. ఇంతకంటె వ్యవహారములో వేరు విధమగు ప్రయోగ మున్నట్టుల గానరాదు. వైద్యమునందు దీని స్వరసమును విషపానము జేసినవానికిచ్చి వమనము జేయించుటకు యుపయోగింతురు. మరియు నీ కాయను నీళ్ళతో నరుగదీసి తేలుకుట్టినచోట లేపనము జేసి గుద్దపాగ వేసినచో విషవేగము శమించును. ఇది గర్భపాతనము జేయునట్లుగా జెప్పబడినది. కాని యీ వృక్షముయొక్క నేయంగమున కిట్టి గుణము గలదో ఎచ్చటను స్పష్టముగా నిరూపించినట్లు గానరాదు.

కుంకుడుచెట్లు మన్యములందును అడవులలోను బెరుగుచున్నవి కాని వాని నెవరు శ్రద్ధతోఁ బెంచుచున్నట్టులేదు. కుంకుడుకాయలను చిరకాలము నుండియు దేహము రుద్దుకొనుటకు నుపయోగించు చున్నాము. సబ్బుకంటె మంచిదని వీనితోడనే శాలువలను, పట్టును ఉతుకుచున్నారు. వెండి బంగారు నగలును గూడ మురికివదలుటకు వీనితోఁ దోమెదరు. మఱియు ఏలకికాయలను కూడఁ గుంకుడురసముతో రుద్దుదురు.

(4) విశేషగుణములు:—

(క) తిక్తరసమును, తీక్ష్ణస్నిగ్ధ గురుగుణములను, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. లేఖనము. కుష్ఠము, కండు, విషము, విస్ఫోటము వీటిని బోగొట్టును. రా_ని., లఘుగుణమును గలిగి యుండును. దాహమును, శూలను బోగొట్టును. వై. ని.

(ఖ) ఫలస్వరసగుణములు:—పానముజేసిన వమనమును, నస్యముజేసిన శిరశ్శూలను బోగొట్టును. రా_ని.

(5) ప్రయోగములు,—

1. దాహమునందు అరిష్టప్రయోగము.

"ఫేనిలాయాశ్చ యః ఫేనః తైర్దాహే లేపనం హితం"

కుంకుడుపళ్ళ నురుగుతో లేపనము జేసిన దాహము శమించును. గ-ని.

2. విషమునందు అరిష్టప్రయోగము.

కుంకుడువేళ్ళు మెత్తగా నూరి కుంకుడుగింజంత సేవించిన పానము చేయబడిన విషము వమనరూపమున బయటకువచ్చును. వై-చిం-విషప్రకరణ.

(6) యోగములు:—

1. అరిష్టకఫలాదివర్తి - వై-చిం-విష.

ఉపయోగములు:—జంబీరరసముతో అరగదీసి కండ్ల కంజనము వేసిన సర్పవిషము శమించును.

(7) Actions and uses:—Expectorant, emetic, anthelmentic and purgative. Externally stimulent and irritant, used in asthma, colic, worms and as a purge combined with Scammony. Externally applied to the mucous membrane of the nose to rouse patients from insensibility in hysteria, epilepsy hemicrania and melancholia; also applied to scrofulas and after glandular swellings and to the bites of venomous reptiles; used also to destroy pediculi and to wash and cleanse the hairs of the head. Pessaries made of the kernal of the seeds are used in amenorrhoea and after child birth to stimulate the uterus to a healthy contraction.

R. N. Khory II. p. 74.

Fumigations with it are useful in hysteria and melancholy. The root is said to be useful as an expectorant. Rheede describes the tree as antiarthritic and says a broth is prepared with the leaves and the root is administered internally. The bark is astringent. We have no record of the use of this fruit as a poision for human beings; doses of 70 grains and more appear to have no injurious effect upon the system when taken as a purge.

Dymock J. p. 368.

## స్వానుభవము

కుంకుడుకాయలు ముఖ్యముగా శరీరమును బట్టలను శుభ్రపరచుటకు ఆంధ్రదేశమున ఉపయోగించునది సర్వజన విదితము. తీక్ష్ణవస్య ముగాకను, విషహారముగ వమన కర్మయందును, ఉపయోగింప వచ్చును. పాశ్చాత్య వైద్యపద్ధతిని, Senega అను ద్రవ్యమునకు బదులు కఫ శోధనముగా నన్నివిధముల నుపయోగించవచ్చును. కాని కఫశోధనమగు నితరద్రవ్యములు అనగా కంటకారి మొదలగునవి యింతకంటె సౌమ్యములగునవి లభించుటచేతను. రుచియందు ఇది అహితముగనుండుటచేతను నేను కుంకుడుకాయను లోపలకిచ్చు మందులలో వాడుటలేదు. కాని హెచ్చుగ వాడవచ్చును.

(ఆ. ల.)

---

# 10

# అలాబూః - ఆనపకాయ (లేక) సొరకాయ. (క)

---

## భాషాంతర నామములు

హిందీ—కద్దూ, కహదూ, లౌకీ, రామతోరయీ. మరాఠీ—దుధ్యా, భోంపళా, భోపళా. గుజరాతీ—దుధీయుం, దుధయుం, దుధియుం. మలయాళం — చోరక్కా. కర్ణాటకం—సొరక్కాయ్. ద్రావిడం—చోరకాయ్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Cucurbitaceae

గుమ్మడి కుటుంబము.

ఆనప—Lagenaria Vulgaris

ఈ కుటుంబములో కామ్మపొట్ల, పొట్టిబుడమ, బూడిదగుమ్మడి, పొట్ల, అడవిపొట్ల, పాముబుడమ, నల్లబుడమ, కొండబుడమ, తియ్యదొండ, కాకిదొండ, బీర, అడివిబీర, గుత్తిబీర, నేతిబీర, కాకర, అగాకర, పందిరిదోస, నక్కదోస, ఆనప, పుచ్చ, కర్బూజ, అప్పగూదతీగె ఈ మొదలగునవి చేరి యున్నవి.

ఈ కుటుంబపుమొక్కలెక్కువగా నుష్ణప్రదేశములలో పెరుగుచున్నవి. ఇవన్నియు తీగలే. వానికి నులితీగెలుగలవు. కొన్నిటి నులితీగెలు చీలియుండును. ఆకులు లఘుపత్రములు. ఒంటరిచేరిక. ఆకులమీదను తీగెలమీదను గూడ రోమములుగలవు. పువ్వులు తెల్లగా నయినను పచ్చగానయినను నుండును. ఏకలింగపుష్పములు. కొన్నితెగలలో మగతీగెలు ఆడతీగెలు గలవు. కింజల్కములుమూడు. ఒకతెగతీగెయందు నైదు కింజల్కములును ఒక్కొకదాని పుప్పొడి తిత్తియందు నొకగదియు నుండుటచేత, నట్టి కింజల్కములు నాలుగు కలిసి రెండుగా నేర్పడినవని యూహించుచున్నాము. అండకోశము నీచము. కాయపై పెంకు కలదికాయ.

ప్రకాండము—తీగె, రోమములుగలవు. ఆకుల దగ్గర మూడు నాలుగు చీలికలుగ నున్న తీగలు గలవు.

ఆకులు:—లఘుపత్రములు. ఒంటరిచేరిక. హృదయాకారము. విషమరేఖపత్రము. రెండువైపుల రోమములుగలవు

పుష్పమంజరి:—తెల్లని పువ్వు. ఒక్కొక కణుపునందున నొక్కొక్కటిగలదు. ఏకలింగపుష్పము. పురుషపుష్పములు.

పుష్పకోశము:—సంయుక్తము. 5 తమ్మెలుగలవు. ఆకుపచ్చరంగు తమ్మెలు సన్నముగానుండును. దళవలయము—సంయుక్తము. 5 తమ్మెలు. పసుపురంగు. పుష్పకోశము నంటి యుండును. కింజల్కములు—3. రెండిటి పుప్పొడి తిత్తులకు రెండేసిగదులు గలవు. కాని యొకదానికి నొకటేగదిగలదు. పుప్పొడి తిత్తులు మెలికలు తిరిగియుండును.

పుష్పము:— పుష్పకోశము దళవలయము. పైదానివలెనుండును.

అండకోశము:— నీచము, ఒకగది, గింజలుచాలగలవు. కుడ్యసంయోగము, అండలంబసంస్థానములు రెండు. కీలము పొట్టి. కీలాగ్రములు మూడు.

ఆనపకాయలుగూడ శీతాకాలములో కాయును. పువ్వులు తెలుపు. కొన్నికాయలు సందర్భముగాను, కొన్ని కోలగాను నుండును. లేతకాయలు కూరను పండుకుందురు. ముదురు కాయలను దొలచి బుఱ్ఱలెండబెట్టి వీణెలకు, తాంబురలకు నుపయోగించెదరు. పాముల వాండ్రూదు నాగస్వరము ఆనపబుఱ్ఱలతోడ జేయుదురు.

## పర్యాయపదములు

శ్లో॥ అలాబూః కథితా తుంబీ, ద్విధా దీర్ఘా చ వర్తులా॥

అలాబు, తుంబి యనునవి యలాబూనామములు.

## అలాబూగుణములు

శ్లో॥ మిష్టతుంబీఫలం హృద్యం పిత్తశ్లేష్మాపహం గురు।
వృష్యం రుచికరం ప్రోక్తం ధాతుపుష్టి వివర్ధనం॥

ఆనపకాయ గురుగుణమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. వెంటనే శుక్రమును గలిగించును. రుచిని బుట్టించును. ధాతువులను పోషించును. పిత్తశ్లేష్మములను శమింపజేయును.

## కటుతుంబీ - చేదుసొరకాయ (ఖ)

హిందీ—కటుతుంబీ, మరాఠీ—కడుంభోపలే, గుజరాతీ—కడవీతుంవడీ మలయాళం — కటుచొరక్కాయ్. కర్ణాటకం — అహవి సొరకాయ్. ద్రావిడం—కటుచొరకాయ్.

శ్లో॥ ఇక్ష్వాకుః కటుతుంబీస్యాత్, సా తుంబీ చ మహాఫలా॥

ఇక్ష్వాకువు, కటుతుంబి యనునవి కటుతుంబీ నామములు.

## కటుతుంబీగుణములు

శ్లో॥ కటుతుంబీ హిమా హృద్యా పిత్తకాస విషాపహా।
తిక్తా కటు ర్విపాకేచ వాతపిత్తజ్వరాంతకృత్॥

చేదుసొరకాయ తిక్తరసమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. హృదయమునకు హితమైనది. పిత్తజకాస, విషము, వాతపిత్తజ్వరము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—

(అలాబు)—అలాబు, (పిండఫల, మహాఫల.)

(కటుతుంబి)—(బృహత్ఫల, దంతబీజ.)

(ఖ) గుణబోధకములు:—

(అలాబు)—తుంబి.

(కటుతుంబి)—(కటుతుంబి, తిక్తతుంబి).

(2) శబ్దార్థములు:—

అలాబు—సామాన్యముగ నా యా వృక్షములయొక్క గాని తీగెలయొక్క గాని ఫలములు క్రిందకు వ్రేలాడినట్లు వ్రేలాడపండునట్టి ఫలము. అనగా భూమిని గాని దీనితో సమమగు నే యితర ఆధారమును గాని ఆశ్రయించి వృద్ధిపొందునట్టిది. పిండఫల—పిండమువలె గుండ్రముగా నుండునట్టి ఫలము. మహాఫల—పొడవుగానుండునట్టి ఫలము. బృహత్ఫల పెద్దదిగా నుండునట్టి ఫలము. దంతబీజ—దంతముల ననుకరించునట్టి బీజములను గలది. తుంబి—రుచిని బుట్టించునది. కటుతుంబి-కటువిపాకముగలది. తిక్తతుంబి—తిక్తరసముగలది.

(3) భేదములు:—

ఆసప మధుర - తిక్త భేదముచే రెండు విధములు. మరియునిది "ద్విధా దీర్ఘా చవర్తులా" అని ప్రత్యేకముగా స్వరూపభేదముచే తిరిగి రెండు విధములుగా నుండును. అనగా వీనిలో గొన్ని గుండ్రముగను, గొన్ని పొడవుగను నుండును. అయితే తిక్తతుంబి యనునది "సాతుంబీ చ మహాఫలా" అని చెప్పుటవలన పొడవుగనే యుండునని తెలియుచున్నను ఇందుగూడ వర్తులాకారము గలవిగూడ నున్నట్లు గానబడును. ఈ రెండును లతా ఫలజాతులలో మరల తిరిగి ఫల శాక వర్గములో గణింపబడుచున్నవి. ఇందు మధురాలాబు లతలను విశేషముగా తోటలలో బెంచుదురు. ఈ లతలు చేరువనున్న పాకలపైని గాని, కంచెలపైని గాని పాకి బాగుగా నలుముకొనును. వీని యాకు గుండ్రముగాను విశాలముగాను నుండి రెండు వైపులను సన్నని తెల్లని నూగును గలిగి యుండును, పువ్వులు తెల్లగ పొడవుగా నుండును. దీని

కాయలను గూడ లేతగా నున్నప్పుడు పైని జెప్పినట్టి నూగు అంటియుండును. ఈ నూగు కాయ ముదిరిన కొలదియు రాలిపోవుచుండును. ఈ కాయలు కొంచెము ఎదిగి లేతగా నున్నప్పుడు సామాన్యముగ నెల్లరును శాకముగా జేసి యాహారమునం దుపయోగించుదురు. అయితే ఈ కాయలను లేతగా నున్నప్పుడు తీగెనుండి కోసినను ఇవి యితరకాయలవలె గాక నిలువ యుంచిన కొలదియు ముదిరిపోవుచుండు స్వభావమును గలవి. కావున తీగెనుండి కోసిన వెంటనే ముచ్చికదగ్గర కొంతవరకు గోసివేసిన యెడల ముదరకుండ లేతగనే యుండును. ఇటుల దీనికి యాహారమునం దనేక విధములుగా నుపయోగము గనపడును. గాని వైద్యమునం దంతగా నున్నట్లు గానుపించదు. దీని యాకు గరుకుగా నుండుటవలన దీనిని కంటిరెప్పయందు పెరిగిన దుర్మాంసమును లేఖనము జేయుటకై యుపశస్త్రముగా నుపయోగించుదురు. అయితే తిక్తాలాబూ లతలను పైవానివలె పెంచరు. మధురాలాబూ బీజములను నాటునపుడు అందీ తిక్తబీజములు గూడ ఒకవేళ కలిసియుండినచో నివి తిక్తబీజములు అని ప్రత్యేకముగ తెలియకుండుటచే నివి పైవానితో గలిసి యుత్పత్తియై వృద్ధిపొంది ఫలించును. వీని యుత్పత్తియు, నభివృద్ధియు, ఫలించుటయు సమానముగనే యుండుటవలన తొలుదొల్త వీని భేదమును గనిపెట్టుట కష్టము. కాని ఫలమును రుచిచూచినప్పుడు అందలి మధుర - తిక్తరసములను బట్టి ప్రత్యేకముగా వీని భేదమును గుర్తింపవచ్చును. ఈ కాయలను పైవానివలె నాహారమునం దుపయోగించరు. ఇవి బాగుగా ముదిరినప్పుడు కోసి యెండబెట్టి ముచ్చికదగ్గర రంధ్రము జేసి లోపలనుండు గుజ్జు మొదలగు వానిని శుభ్రపరచి అందు అనువుగనుండు వస్తువులనుంచి భద్రపరుచుకొనుదురు. ఇటులనే యీ యెండిన కాయలను పాములవాండ్రు, మంత్రగాండ్రు మొదలగువారలు గాన యంత్రములుగా నుపయోగించుదురు. మరియు దీనికి పైదానివలె గాక వైద్యమునందు విశేష ప్రయోగ మున్నట్లు గానబడును. మరియు శస్త్రవిధియందు రక్తమోక్షణాది క్రియలకు జెప్పబడిన అలాబూప్రయోగము ఇట్టి కాయలతోనే జేయబడునట్లుగా దెలియగలదు.

(4) విశేషగుణములు:--

(క) మధురాలాబు—లఘుగుణమును గలిగియుండును. రా-ని. రూక్ష గుణమును, మిగుల శీతవీర్యమును గలిగి యుండును. మలమూత్ర సంగమును

భేదించును. శో_ని. మధురరసమును, స్నిగ్ధగుణమును గలిగి యుండును. గర్భమును పోషించును. వాతమును వృద్ధిపొందించును. మ_ని. వాతశ్లేష్మములను వృద్ధిబొందించును. పిత్తమును శమింపజేయును. రా_ని.

(ఖ) అలాబూకాండము - మధురరసమును, స్నిగ్ధగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. మలభేదనము జేయును. కఫమును వృద్ధిబొందించును. పిత్తమును శమింపజేయును. ని_ర.

(గ) కటుతుంబి - విషమునందును, కఫప్రకోపమునందును వమనము జేయించుటకు శ్రేష్ఠమైనది. శ్వాసను, ఛర్దిని బోగొట్టును. ధ_ని. తీక్ష్ణగుణమును గలిగి యుండును. మలమును శోధించును. శోఫను, వ్రణమును, శూలను బోగొట్టును. రా_ని.

(ఘ) కటుతుంబీపత్రము_ మధురవిపాకమును గలిగి యుండును. విశేషముగా మూత్రమును శోధించును. పిత్తమును శమింపజేయును.

(5) ప్రయోగములు —

(ఖ) కటుతుంబీ—

1. అశ్మరియందు కటుతుంబీ ప్రయోగము.

> "నృత్యకుండల బీజానాం చూర్ణం మాక్షిక సంయుతం ।
> అవిక్షీరేణ సప్తాహం పీత మశ్మరీ పాతనం"

చేదానపకాయగింజల చూర్ణమును తేనెతోగలిపి గొర్రెపాలతో నేడు దినములు సేవించిన అశ్మరీపాతన మగును. వా_చి_అ. 11. శ్లో. 30.

2. గలగండయందు కటుతుంబీ ప్రయోగము.

> తిక్తాలాబూ ఫలే పక్వే సప్తాహ ముషితం జలం ।
> మద్యం వాగలగండఘ్నం పానాత్ పథ్యాను సేవినః"

పండిన చేదుసొరకాయకు ముచ్చికదగ్గర కోసి అందు లోపలనున్న గుజ్జు మొదలగు వానిని తొలగించి జలమునుగాని, మద్యమును గాని నిండించి తిరిగి పైన మూసి యేడుదినము లూరబెట్టి పిమ్మట నా ద్రవమును పానము జేయుచు పథ్యమును సేవించుచుండిన గలగండము శమించును. చ_ద.

3. అర్శోరోగమునందు కటుతుంబీ ప్రయోగము.

"తుంబీబీజం సౌద్భిదంతు కాంజిపిష్టం గుడీత్రియం।
అర్శోహరం గుదసంస్థా ద్ధధిమాహిష మక్షతః"

చేదుసొరకాయగింజలను ఔద్భిదలవణమును కాంజికముతో మెత్తగా నూరి మూడు మాత్రిలు జేసి గేదెపెరుగుతో సేవించిన అర్శోరోగము శమించును. చ_ద.

4. ప్రదరమునందు కటుతుంబీప్రయోగము.

"అలాబూఫలచూర్ణస్య శర్కరాసహితస్య చ।
మధునా మోదకం కృత్వా ఖాదే త్ప్రదరశాంతయే॥

చేదుసొరకాయ చూర్ణమును, తేనెను, చక్కెరను ఒకటిగా కలిపి మోదకముజేసి సేవించిన ప్రదరము శమించును. భా_ప్ర.

5. యోనిరోగమునందు కటుతుంబీప్రయోగము.

"తుంబీపత్రం తథాలోధ్రం సమభాగం సుపేషయేత్।
తేన లేపో భగేకార్యః శీఘ్రం స్యా ద్యోని రక్షతా॥"

చేదానపాకును, లొద్దుగపట్టను సమభాగములుగ గ్రహించి మెత్తగా నూరి యోనియందు లేపనముజేసిన యోనివ్యాపత్తులు శమించును. భా_ప్ర.

6. దంతక్రిమియందు కటుతుంబీప్రయోగము.

"కటుతుంబీమూలం సంచూర్ణ్య।
దశనవిఘృష్టం దశనక్రిమినాశనం ప్రాహుః"

చేదుసొరవేరు చూర్ణముతో దంతములను తోమిన యెడల దంతక్రిమి నశించును. భా_ప్ర.

7. శోథయందు కటుతుంబీప్రయోగము.

"లోమశా కటుతుంబీ చ కాంజికేన జలేనవా।
నిఃక్వాథ్య చా పి సంస్వేద స్త ద్భవో ష్ణేన తేనచ"

లోమశఫలము చేదుసొర వీనిని కాంజికముతో గాని జలముతో గాని ఉడకబెట్టి వేడిగ నున్నట్టి యా ద్రవముతో స్వేదము జేసిన శోథ శమించును. హ_సం.

8. కర్ణరోగమున ను కటుతుంబీప్రయోగము.

"తుంబీరసం చ ధార్యేత కర్ణరోగే ప్రశస్యతే"

చేదుసొర రసమును కర్ణ పూరణము జేసిన హితము. హ-సం.

9. యోనిదోషమునందు కటుతుంబీప్రయోగము.

"కటుకాలాబు సంసిద్ధం తైలమభ్యం జనాద్భవేత్ ।
యోనిదోషహరం నార్యాః గర్భ ముత్పాదయే దపి"

చేదుసొర రసముతో గాచిన తైలమును యోనియం దభ్యంజనము జేసిన యోని దోషము శమించును. గర్భధారణ యోగ్యమగును. వై-మ.

(6) యోగములు:—

(క) కటుతుంబి—

1. తిక్తతుంబ్యాది తైలము - చ - కుష్ఠ.

ఉపయోగములు:—అభ్యంగము జేసిన కండూ, కుష్ఠము శమించును.

2. కటుతుంబీ తైలము - భైషజ్య - గలగండాది.

ఉపయోగములు:—నస్యముజేసిన గలగండ శమించును.

3. ఇక్ష్వాకుబీజాదివర్తి - భైషజ్య - యోనిరోగ.

ఉపయోగములు:—యోనియందు ధరింపుటవలన ఆర్తవప్రవృత్తి గలుగును.

4. కటుతుంబ్యాద్యావర్తి - గ-ని-అర్శోరోగ.

ఉపయోగములు:-గుదము నందుంచుటవలన అర్శోరోగము శమించును.

(7) Actions and uses:—The pulp of Karvi tumbdi is emetic and purgative. The oil is used as a cooling and emollient application for the head. The pulp of sweet dudhi is an ingredient in various confections. The seeds are nutritive and diuretic and constitute one of the five cucurbitaceous seeds.

R. N. Khory II. p. 312.

# 11

# అశోక.

## భాషాంతర నామములు

సం_ అశోక; ద్రా_అశోకం. క_అశోకాడ; మ_అశోగం; ఈ_అశోక్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Leguminosae.

### సీతాఫల కుటుంబము—Saraka Indika.

ఈ కుటుంబమునందు సీతాఫలపుచెట్టు, రామాఫలపుచెట్టు, సంపెంగి, నరసామిడి మొదలగునవి చేరియున్నవి.

ఆకులు:—ఒంటరిచేరిక, కొమ్మకు రెండువైపులనే యుండును. లఘుపత్రములు. కురుచతొడిమ, కణుపు పుచ్ఛములులేవు. సమగోళాకారము, సమాంచలము, కొనసన్నము.

పుష్పమంజరి:—కణుపునందుల నొక్కొక పుష్పముండును. సరాళము ఆకు పసుపు రంగు.

పుష్పకోశము:—రక్షకపత్రములు మూడు చిన్నవి. పీచము. దళవలయము:—ఆకర్షణ పత్రములు మూడు. పెద్దవి. సన్నముగ నిడివి చౌకపు నాకారముగను దళసరిగను నుండును.

కింజల్కములు:—అసంఖ్యములు. సంయోజకములు. పుష్పాడి తిత్తుల పైకి వచ్చి యున్నవి. అండకోశము:—స్త్రీ పత్రములన్నియు విడి విడిగానున్నవి. అవి చాలగలవు. ఒక్కొకదాని కొక్కొక్క కీలమున్నది. స్త్రీ పత్రములును కింజల్కములును గోపురమువలె నున్న వృంతాగ్రముపైనున్నవి. ఫలము కండకాయ.

ఈ కుటుంబములో పెద్దచెట్లును గుబురుమొక్కలును గలవు. కొన్ని తీగెలవలె నల్లు కొనును. ఈ మొక్కలు శీతలదేశమున నంతగా లేవు. ఆకులు ఒంటరిచేరిక. సాధారణముగా రెండు వరుసలుగానే యుండును. కణుపు పుచ్ఛములుండవు. సమాంచలము. కొన్నిటి యాకు లకును సువాసనగలదు. వృంతాగ్రము గోపురమువలెనుండును. రక్షకపత్రములును ఆకర్షణ పత్రములును వలయమునకు మూడేసిగలవు. కింజల్కములును స్త్రీ పత్రములును అసంఖ్య ములు కింజల్కపు కాడల సంయోజకములు పుష్పాడి తిత్తుల పైకివచ్చియుండును. గింజలకు బీజపుచ్ఛముగలదు.

అశోకమునందు 2 జాతులిప్పుడుపయోగములో నున్నవి. (1) ఎఱ్ఱపువ్వులు గలది లషింగ్టన్ చెట్లపట్టిలో 977 నెంబరున Saraca Indika అను పేరుతోనున్నది. (2) 40వ నెంబరున Polyalthia Longifolia అను పేరుతోనూగలవు.

ఒకటి నరాళా జాతి:—ఇది Leguminosae చిక్కుడు కుటుంబములోనిది. మహాభారతములో శోకము లేనిదని వర్ణింపబడియున్నది. రక్తాశోక, అశోక, అంగనప్రియా, ఛాయా, గంధపుష్పా, కామబాణా, క్రిమికారకా, నంజులా, విచిత్రా, విటశోకా మొదలగు

నామాంతములుగలది. ఈ చెట్టు రమారమి 20 అడుగుల ఎత్తువరకు పైగా పెరుగుసది. ఉత్తర సర్కారులలో అరుదుగను పశ్చిమ సముద్రతీరస్థ కొండలయందున మైసూరు సందున 4000 అడుగుల ఎత్తుగల భూమివరకు నిత్యము పచ్చగనుండు అడవులలో పెరుగును పెంపుడు తోటలలో గూడగలదు.

(2) Polythia Longifolia కెరటముపలె ఎత్తుపల్లముగల అంచులుగల పొడుగాటి ఆకులుగలిగి విస్తృతము దోడపక్కను నీడకై పెంపబడుచెట్లు, దేవదారు, పుత్రజీవి, నరమామిడి యను నామాంతరములుగలది. Ananaceæ మనోరంజతము ఈ కుటుంబపులోనిది. ఈ చెట్టుకూడా రమారమి 20 అడుగులు పైగా పెరుగుచుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ అశోకో హేమపుష్ప శ్చ వంజుల స్తామ్రపల్లవః।
కంకేల్లిః పిండపుష్పశ్చ గంధపుష్పో నట స్తథా ॥

అశోకము, హేమపుష్పము, వంజులము, తామ్రపల్లవము, కంకేల్లి, పిండపుష్పము, గంధపుష్పము, నటము అనునవి అశోక నామములు.

(1) శబ్దార్థములు:—

హేమపుష్పము = బంగారువర్ణముగల పుష్పములతో నొప్పియుండునది; వంజులము = చూచుటకు మనోహరముగా నుండునది. తామ్రపల్లవము= ఎర్రని చిగుళ్ళనుగలది; పిండపుష్పము = ముద్దవలెనుండు పుష్పములను గలది; కర్ణపూరక = చెవులయం దలంకరింపబడు పుష్పములనుగలది; అంగనాప్రియ = స్త్రీలకు సంతోషమును గలిగించునది; కాంతాచరణదోహద=స్త్రీల యొక్క పాదస్పర్శచే పుష్పించునట్టి స్వభావముగలది; స్త్రీ నిరీక్షణదోహద= స్త్రీల దృష్టిప్రసాదముచే పుష్పించునట్టి స్వభావముగలది; అశోకము = దుఃఖము లేకుండునట్లు చేయునది; లేక స్త్రీల గర్భాశయజ రోగములనెడి దుఃఖములను బోగొట్టునది; మధుపుష్ప = మధురరసముగల పుష్పములను గలది; శేక శేనెగల పుష్పములతో గూడియుండునది; దోషహారి=దోషములనువిశేషముగ గర్భాశయగత దోషములను శమింపజేయునది.

(2) గుణములు—

శ్లో॥ అశోక శ్శీతల స్తిక్తో గ్రాహీ వర్ణ్యః కషాయకః।
దోషా పచీ తృషా దాహ కృమి శోష విషా స్రజిత్ ॥

అశోకవృక్షము తిక్తరసమును, కషాయామధురసమును, శీతవీర్యమును గలిగి యుండును. వర్ణమును గలిగించును. దోషములను శమింపజేయును.

అపచి, తృష్ణ, దాహము, కృమి, శోష, విషము, రక్తదోషము అను నీ వ్యాధులను బోగొట్టును.

స్తంభనము, రసాయనము, గర్భస్థాపనము, గర్భాశయ వ్యాధులను రక్తము పడుటను పోగొట్టును.

(3) విశేష గుణములు:—

హృదయమునకు హితమైనది. పిత్తమును శమింపజేయును. శ్రమను, గుల్మమును, ఉదరమును, ఆధ్మానమును శమింపజేయును. (రా-ని) మధుర రసమును, శీతోష్ణవీర్యములను గలిగియుండును. అస్థిసంధానము జేయును. స్త్రీ రోగములను, శూలను, సమస్త వ్రణములను, శోథను, జ్వరమును, అర్శస్సును బోగొట్టును. (శో-ని.)

(4) భేదములు:—

(1) కవులు స్త్రీలకు ప్రియమని వర్ణించినట్టి వృక్షము. దీని ఛాయను లంకలో సీత నివసించెను. ఎరుపుతోగూడిన పసుపువర్ణముగల పూవులుగలది. బెంగుళూరు లాల్ బాగ్ లో ఒక చెట్టు ఉన్నది.

(2) తెల్లపూవుల అశోక మఱియొకటి గలదని నిఘంటుకారులు వ్రాసియున్నారు.

(5) మోతాదు:—

అశోకపట్టను కేవలము చూర్ణముగా నుపయోగించుట అరుదు. దీనిని కషాయము గాచి వడియగట్టి నీటి నిగరబెట్టి మెత్తని సారమును (రసక్రియ) 5 గ్రైనులయెత్తు మోతాదు తరుమగ నుపయోగింతురు.

మఱియు—దీని ఎండుచెక్కను 16 భాగముల నీటిలో వేసి నాల్గవ భాగము మిగులునట్లు కాచవలెను. ఈ కషాయమును ½ మొదలు 2 ఔన్సుల వఱకు కొంచెము తేనెగాని చక్కెరగాని చేర్చి ఇవ్వవచ్చును.

(6) ప్రయోగములు:—

1. అసృగ్దరము—

"అశోకవల్కల క్వాథశృతం క్షీరం సుశీతలం।
యథాబలం పిబేత్ప్రాతః తీవ్రాసృగ్దరనాశనం"॥

అశోకపట్ట కషాయముతో గాచి చల్లార్చిన పాలను బలము ననుసరించి ప్రతిరోజున సేవించిన తీవ్రమగు అసృగ్దరము శమించును. (చ-ద.)

2. మూత్రాఘాతము—

"జలేన ఖదిరీబీజం మూత్రాఘాతా శ్మరీ హరం"॥

అశోకబీజ చూర్ణమును జలముతో సేవించిన మూత్రాఘాతము అశ్మరియు శమించును. (చ-ద.)

(7) యోగములు:—

(1) అశోకఘృతము:—అనేక వర్ణములుగల ప్రదరము, కుక్షిశూల, కటిశూల, యోనిశూల, అగ్నిమాంద్యము, అరుచి, పాండు, కార్శ్యము. శ్వాస, కాస, కామిలలయందుపయోగము. మోతాదు 1 తులము (భైషజ్య, ప్రదర)

(2) అశోకారిష్టము:—అసృగ్దరము, జ్వరము, రక్తపిత్తము, అర్శస్సు, అగ్నిమాంద్యము, అరుచి, ప్రమేహము, శోఫలు శమించును. మోతాదు 1 ఔన్సు. (భైషజ్య. ప్రదర)

(3) అశోకరస క్రియా వటి, అశోకవటి, అశోకాదివటి మొదలగు ఔషధములు.

8. Actions and uses:—Astringent; the decoction with a number of aromatics is given in uterine affections-Chiefly in menorrhagia.

R. N Khory Part II. p 217.

## స్వానుభవము.

ఋతురక్తము ఎక్కువగా పోవుచున్నప్పుడు స్తంభనముగ దీని నుపయోగింప వచ్చును. రసాయనములతో దీనిని చేర్చిగాని ద్రవరూపముగ (అశోకారిష్టము)గాని ఇవ్వవచ్చును. ఎర్రపూవులు పూయునదియే సరియైన అశోకవృక్షము; కాని దక్షిణ హిందూస్థానములో దారిప్రక్కలను పెరుగు నర మామిడిచెట్టును అశోకవృక్షముగ వాడుచున్నారు. ఇదియును గుణమిచ్చుచున్నది. (ఆ. ల.)

# 12

# అశ్వగంధా - పెన్నేరు (గడ్డ)

---

## భాషాంతర నామములు

హిందీ - అసగంధ, మరాఠీ - అసకంధ, గుజరాతీ - ఆసంధ, ఆసన, ఘోడాఆహాన, మలయాళం - అముక్కిరం, కర్ణాటకం - అశ్వగంధ, ద్రావిడం - అముక్కిరెంకిళంగ్.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Solanaceae

వంగ కుటుంబము

### పెన్నేరు—Withania Somni fora

ఈ కుటుంబమునందు వంగ, నీటివంగ, మెరప, బంగాళాదుంప, పెన్నేరు, పొగాకు, ఉమ్మెత్త, రసగడ్డిమాను, నేలములగ, ఉస్తిమొక్క ఈ మొదలగునవి చేరి యున్నవి.

మాదిరికి వంగవర్ణనము ఈ క్రింద వివరింపబడి యున్నది.

ఆకులు:—కొంచెమించుమించు అభిముఖచేరికగా నుండును. అండాకారము. అఖ పత్రములు. తమ్మెలుగలవు. అడుగువైపున రోమములుగలవు. కొన్నిరకములలో ఆకులు మీదను కొమ్మమీదను ముళ్లుగలవు.

పుష్పమంజరి:—మధ్యారంభమంజరులు సరిగా గణుపుసందులనుండవు. సాధారణముగ నొకొక్కచో రెండుమంజరులుండును. ఒకదానిపై నొక మిధున పుష్పమును రెండవదాని మీద పురుషపుష్పమును నుండును. పువ్వులు నీలపురంగు.

పుష్పకోశము:—సంయుక్తము. అయిదుతమ్మెలు. బిల్లెపాకారము. నీచము. కాయ తోగూడ పెద్దదగును.

దళవలయము:—సంయుక్తము. 5 తమ్మెలు నీలపురంగు.

కింజల్కములు:—5 కాడలు పొట్టి. దళవలయమునంటి యుండును. పుప్పొడితిత్తు లకు చివరరంధ్రము లేర్పడి వానిద్వార పుప్పొడి బయటకు వచ్చును.

అండకోశము:—అండాశయము ఉచ్చము. కీలము పొడుగు. ఫలము కండకాయ.

ఈ కుటుంబములో గుల్మములు, గుబురుచెట్లు, చిన్నచెట్లును గలవు. ఆకులు వంటరి చేరిక. వృంతముయొద్ద అభిముఖచేరికగ నుండిన నుండవచ్చును. పుష్పము లొంటరిగా నయినను మధ్యారంభ మంజరులుగానయిన నుండును. కొన్ని మొక్కల పుష్పములు

మాత్రము అనరాళము. పుష్పకోశము, 5, దళవలయము, 5, సంయుక్తము, కింజల్కములు 5, దళవలయమునంటి యుండును, అండకోశము, ఉచ్చము, అండాశయము సరాళముగ నుండక కొంచెము వంకరగ నుండును. 2 గదులు. కొన్నిటిలో నింక నెక్కువ యుండును. కీలాగ్రములు 2. ఫలము కండకాయ.

పెన్నేరు చిన్నగుబురు మొక్క ఇది మెరకనేలలమీద పలుతావులందు పెరుగుచున్నది. పువ్వులు చిన్నవి. ఆకు పచ్చగానుండును. కాని అంగళ్లయందు నితరదుంపలనుగూడ బెన్నేరు దుంపలని యమ్ముదురు మట్టిపాలదుంపయు కొంచెము పెన్నేరు దుంపనుపోలి యుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ గంధాంతా వాజినామాది రశ్వగంధా హయాహ్వయా ।
వారాహికర్ణీ వరదా బలదా కుష్ఠగంధినీ ॥

వాజిగంధ, అశ్వగంధ, హయాహ్వా, వారాహికర్ణి, వరద, బలద, కుష్ఠగంధిని యనునవి యశ్వగంధ నామములు.

## అశ్వగంధా గుణములు

శ్లో॥ అశ్వగంధానిల శ్లేష్మ శ్విత్ర శోథ క్షయాపహా ।
బల్యా రసాయనీ తిక్తా కషాయో ష్ణాతి శుక్రలా ॥

పెన్నేరుగడ్డ తిక్తరసమును, కషాయానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. బలమును గలిగించును. రసాయనము. మిగుల శుక్రమును వృద్ధిపొందించును. వాత శ్లేష్మములను శమింపజేయును. శ్విత్రము, క్షయము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధ నామములు:—

(క) పరిచయ బోధకము:—అశ్వగంధ, వారాహికర్ణి, కుష్ఠగంధిని, (హయప్రియ, గంధపత్రి.) (ఖ) గుణబోధకములు: —బలద, (వాజికర, పుష్టిద, వాతఘ్ని.)

(2) శబ్దార్థములు:—

అశ్వగంధ - గుఱ్ఱముయొక్క వాసనగలది. వారాహికర్ణి - వరాహముయొక్క కర్ణమువంటి పత్రములను గలది. కుష్ఠగంధిని - చెంగల్వకోష్ఠు వంటి పరిమళమును గలది. హయప్రియ - గుర్రములకు ప్రియమైనది. గంధపత్రి - పరిమళముతో గూడిన పత్రములను గలది. బలద - బలమును గలి

గించునది. వాజీకర - శుక్రమును వృద్ధిపొందించునది. పుష్టిద - ధాతువులను పోషించునది. వాతఘ్ని - వాతమును శమింపజేయునది.

(3) పరిచయ బోధక లక్షణము:—

"కందినీ వాజిగంధా స్యాత్ క్షుపా.........।
వనజా వృత్తపర్ణీ చ కందో వాజీకరః స్మృతః।

పెన్నేరు క్షుపజాతిలో నుత్పత్తి గలిగి గుండ్రని యాకులతో నొప్పి యుండును. కందమును గలిగి యుండును. ఈ మొక్క గుర్రమువంటి వాసన గలిగి యుండును. ఇది యడవులం దుత్పత్తి యగును. దీని కందము వాజీకరము. శి-ద.

(4) భేదములు:—

ఇది చిన్న, పెద్ద భేదముచే రెండు విధములుగా నుండి కందజాతి క్షుపములలో నుత్పత్తి గలిగి శుక్రవృద్ధికర, బలకరాది ద్రవ్యములలో గణింప బడుచున్నది. అయితే నిందలి చిన్న జాతి కందము నిఘంటువులలో నెచ్చటను వర్ణింపబడినట్లు గానరాదు. కాని వ్యవహారమునందు మాత్రము సన్నముగ నుండునది యొకటియు, లావుగ నుండునది యొకటియు గాన నగును. ఉత్పత్తియం దొకే విధమగు బీజమును గలిగి పెద్ద కందము నంటి యుండు చిన్నవిగను సన్నముగ నుండు కందములు ప్రత్యేకముగా గ్రహింప బడి యిట్లు రెండు విధములులుగా విక్రయింపబడు చున్నవో (లేక) ఉత్పత్తి యందే యటుల బీజభేదమును గలిగి రెండు విధములగు స్వరూపములతో విక్రయింపబడుచున్నవో దెలియకున్నది. వీనిలో కొందరు చిన్న జాతినే శ్రేష్ఠమైన దానినిగాను, మరి కొందరు పెద్ద జాతినే శ్రేష్ఠమైన దానినిగాను జెప్పుదురు. అయితే యోగములందు రెండు విధములగు కందములకును ప్రయోగము లున్నట్లు వ్యవహారమునందు గానబడును.

ఈ క్షుపము తెల్లయుమ్మెత్త మొక్కలంత ఎత్తు గలిగి పర్వతముల మీదను, అడవులలోను నుత్పత్తి యగును. ఆకులు కొంచెము హెచ్చు తక్కు వగ నుమ్మెత్త యాకులంత యుండును. కాని కొంచెము గుండ్రముగను, దళసరిగను నుండును. భూమిలో లావుగనుండు కంద మంటియుండును. దీనిని చిన్న చిన్న ముక్కలనుగా నరికి యెండించి బజారులందు విక్రయించు దురు. ఇది పైని జెప్పిన శుక్రవృద్ధికర - బలకరాది యోగములలో విశేష

ముగా నుపయోగింప బడుచున్నది. మరియు నాంధ్రమునందలి "పేరులేని వ్యాధికి పెన్నేరుగడ్డ" యను సామెతను బట్టి ప్రతి వ్యాధియందు కూడ నుపయోగింప బడునట్లు దెలియగలదు. వత్సనాభి యను విషమున కిది విరుగుడు ద్రవ్యముగా నుపయోగింప బడుచున్నది, వ్యవహారమునందు దీని ప్రయోగము గానరాకున్నది.

(5) విశేషగుణములు :—

(క) వర్ణమును గలిగించును. విషమును, వ్రణమును బోగొట్టును. ధ-ని, కటురసమును గలిగి యుండును. కాసను, శ్వాసను బోగొట్టును. రా-ని. క్రిమిని, కండువును బోగొట్టును. ని-ర. (ఖ) పత్రము-లేపనము జేసిన గ్రంధి, గలగండ, గండమాల, అపచి యివి శమించును. శో-ని.

(6) ప్రయోగములు:—

1. శ్వాసయందు అశ్వగంధా ప్రయోగము.

"క్షారం చా శ్వ గంధాయాః లేహయేత్ క్షౌద్ర సర్పిషా"

పెన్నేరుగడ్డ క్షారమును మధుఘృతములతో సేవించిన శ్వాసరోగము శమించును. చ-చి-అ 21.

2. గ్రంధియందు అశ్వగంధా ప్రయోగము.

"సుఖోష్ణయా ప్రదిహ్యా ద్వా పిష్టయా చా శ్వగంధయా"

పెన్నేరాకుల కల్కమును ఉడికించి సుఖోష్ణముగ లేపనము జేసిన గ్రంధి శమించును. చ-చి-అ 11.

3. ఊరుస్తంభమునందు అశ్వగంధా ప్రయోగము.

"మూలై ర్వా ప్యశ్వగంధాయాః.........
క్షౌద్ర సర్షప వల్మీక మృత్తికా సంయుతై ర్భిషక్ ।
గాఢ ముత్సాదనం కుర్యా దూరుస్తంభే ప్రలేపనం"

పెన్నేరువేళ్ళు, ఆవాలు, పుట్టమన్ను వీనిని మెత్తగా చూర్ణించి తేనెతో గలిపి గాఢముగా ఉత్సాదనము (నలుగుపెట్టుట) జేసి, పిమ్మట లేపనము జేసిన ఊరుస్తంభము శమించును. చ-చి-అ 27.

4. శోషయందు అశ్వగంధా ప్రయోగము:—

"క్షీరం పిబే ద్వా ప్యథ వాజిగంధా ।
విపక్వ మేవం లభతే చ పుష్టిం ॥
తదుత్థితం క్షీరఘృతం సితాఢ్యం ।
ప్రాతః పిబేద్వా థపయోనుపానం ॥"

పెన్నేరుగడ్డ కషాయముతో గాచిన పాలను గాని, పై విధముగ గాచిన పాలనుండి గ్రహింపబడిన ఘృతమునందు చక్కెరను గలిపి పాలను అనుపానముగా జేసి గాని ప్రతి యుదయము నందును సేవించిన శోష శమించి బలము గలుగును. సు-ఉ-అ 41.

5. వాతవ్యాధియందు అశ్వగంధా ప్రయోగము.

"అశ్వగంధా కషాయే చ కల్కే క్షీర చతుర్గుణం।
ఘృతం పక్వం తు వాతఘ్నం వృష్యం మాంసవివర్ధనం ॥"

పెన్నేరుగడ్డ కషాయమునందు పెన్నేరుగడ్డ కల్కమును, నాలుగు భాగముల పాలను, ఒక భాగము ఘృతమును జేర్చి పరిభాషానుసారముగ పక్వము జేసి సేవించిన వాతరోగములు శమించును. శుక్రమును మాంసమును వృద్ధియగును. చ-ద.

6. శిశువుయొక్క కార్శ్యమునందు అశ్వగంధా ప్రయోగము.

"పీత్వా శ్వగంధా పయసార్ధమాసం ఘృతేన
తైలేన సుఖాంబునా వా। కృశస్య పుష్టిం వపుషో
విధత్తే బాలస్య సస్యస్య యథా ఽంబు వృష్టిః॥"

పెన్నేరుగడ్డ చూర్ణమును పాలతో గాని, ఘృతముతో గాని, తైలముతో గాని యొకటిన్నర మాసము సేవించిన శిశువులకు గలుగు కృశత్వము పోయి బలము కలుగును. చ-ద.

7. ఉదరమునందు అశ్వగంధా ప్రయోగము.

"గోమూత్రపిష్టా మథ వా శ్వగంధాం
పీత్వాశు హన్యా దుదరం ప్రవృద్ధం।
కృమీన్ సశోథా నుదరం చ దూష్యం॥"

పెన్నేరుగడ్డ చూర్ణమును గోమూత్రముతో నూరి సేవించిన అధికముగ వృద్ధిబొందినట్టి యుదరము, క్రిములు, శోథ, దూష్యోదరమును శమించును. గ-ని.

9. వంధ్యారోగమునందు అశ్వగంధా ప్రయోగము.

అశ్వగంధాకషాయేణ మృద్వగ్నౌ పరిసాధితం।
ఋతుకాలే పిబే ద్వంధ్యా గర్భసంధానకం ఘృతం"

పెన్నేరుగడ్డ కషాయముతో మందాగ్నిచే పక్వము జేసిన ఘృతమును ఋతుకాలమున సేవించిన వంధ్యాత్వము బోయి గర్భవతియగును. గ-ని.

10. నిద్రానాశమునందు అశ్వగంధా ప్రయోగము.

"చూర్ణం హయగంధాయాః సితయా సహితం చ సర్పిషా లీఢం।
విదధాతి నష్టనిద్రే నిద్రా మాశ్వేవ సిద్ధమిదం॥"

పెన్నేరుగడ్డ చూర్ణము నందు చక్కెరను, ఘృతమును గలిపి సేవించిన నష్టనిద్రత బోయి నిద్రగలుగును. వం-సే.

(7) యోగములు:—

1. అశ్వగంధాది త్రయోదశాంగ గుగ్గులు- చ-ద-వాజీకర. మాత్ర.— 1 కర్షం. ఉపయోగములు:—కటీగ్రహము, గృధ్రసీవాతము, హనుస్తంభము, కుబ్జము. హృద్రోగము, యోనిరోగము ఇవి శమించును. భగ్నాస్థిసంధానమగును.

2. అశ్వగంధారిష్టము - భైషజ్య - మూర్ఛ. మాత్ర:—1 ఔన్సు, ఉపయోగములు:—మూర్ఛ, అపస్మారము, శోష, ఉన్మాదము, కార్శ్యము, అర్శస్సు, అగ్నిమాంద్యము, వాతరోగము ఇవి శమించును.

3. అశ్వగంధాఘృతము - భైషజ్య, ధ్వజభంగ. మాత్ర:—1 కర్షం. ఉపయోగములు:—పుష్టి, తేజస్సు, బలము, ఆయువు ఇవి గలుగును. వంధ్యాత్వము బోవును. శుక్రవృద్ధి యగును.

4. బృహదశ్వగంధా ఘృతము - భైషజ్య - వాజీకర, మాత్ర:— 1 తులం. ఉపయోగములు:—క్షీణేంద్రియము, క్షీణశుక్రము, ఇవి శమించును. వృద్ధులకు, బాలురకు, అబలురకును హితము, ఓజస్యము, హృద్యము, వంధ్యాత్వము, వలీపలితములు, ఖాలిత్యము, తిమిరము, కాస, శ్వాస, హిక్క, విషమజ్వరము ఇవి శమించును.

5. అశ్వగంధ రసాయనము - వై - చిం - క్షయ. మాత్ర:-తులం. ఉపయోగములు:—క్షయము, రక్తపిత్తము, అమ్లపిత్తము, కామిల, పాండు, అస్థిగతజ్వరము, పురాణజ్వరము ఇవి శమించును. బల్యము, రసాయనము, బృంహణము, వీర్యవర్ధకము.

6. అశ్వగంధాది ఘృతము - వై - చిం - క్షయ. మాత్ర:—తులం. ఉపయోగములు:—క్షయము, ఊరుస్తంభము, రక్తపిత్తము, పురాణజ్వరము, దాహము, విసర్పము, వలీపలితము, స్వరభంగము ఇవి శమించును.

7. అశ్వగంధాది చూర్ణము - నై - చిం - క్షయ. మాత్ర:- ½ తులం. ఉపయోగములు:—క్షయము, ప్రమేహము, భ్రమ, రక్తపిత్తము, క్షత క్షీణము, మేదోరోగము, అగ్నిమాంద్యము, కుక్షిశూల, ఉదరము ఇవి శమించును. బల్యము,

8. అశ్వగంధా బలా లాక్షాది తైలము - వై - చిం - క్షయ. ఉపయోగములు:—అభ్యంగము జేసిన జ్వరము, శోష, కాస, శ్వాస, పక్షవధ, అపస్మారము, దాహము, క్షయ, ఇవి శమించును. ధాతువర్ధనము.

9. అశ్వగంధా తైలము - చ - ద- వాతరోగ.
ఉపయోగములు—అభ్యంగము జేసిన వాతరోగములు శమించును.

10. Actions and uses:—Tonic, alterative and sedetive; a part of the root taken with milk and clarified butter helps the nutrition of weakly children. As an alterative a confection is given in consumption, debility from old age, and rheumatism. Native women combine it with various restoratives in nervous debilities and leucorrhoea......It is given internally in 15 to 60 minim doses in consumption, emaciation of children, leprosy, nervous diseases.

R. N. Khory II. p. 452.

## అశ్వగంధచేరిన కొన్ని ఇతర యోగములు.

1. అశోకఘృతము, 2 అశ్వగంధాది చూర్ణము, 3. అశ్వగంధాది లేహ్యము, 4. అశ్వగంధారిష్టము, 5. చ్యవనప్రాశ లేహ్యము, 6. నారాయణ తైలము, 7. సుకుమార ఘృతము, 8. బలారిష్టము, 9. యోగరాజ గుగ్గులు 10. లాక్షా తైలము, 11. శారిబాద్యాసవము, 12. శివా మోదకము, 13. సారస్వతారిష్టము.

## స్వానుభవము.

[నేనుపయోగించు మందు లన్నిటిలో మొత్తం మీాద పెన్నేరు (అశ్వగంధ) అన్నిటికంటె యెక్కువ చేరుచున్నది.

ఇది ఆయుర్వేదౌషధములలో మిక్కిలి ప్రసిద్ధమైన ధాతువర్ధకౌషధము. జ్వరము విడిచిన తరువాత కలుగు బల

హీనతయందును, నాడీదౌర్బల్యముచే గలుగు నిద్రలేమియందును దీనిని లేహ్యము, రసాయనము మున్నగు వానిగా తయారుచేసి ఈయవచ్చును. నాభి మున్నగు విషములు శరీరములో ప్రవేశించినపుడును, సెగ, సవాయి మున్నగు వ్యాధులచే శరీరమునందు విషములు నిలువ యుండినప్పుడును ఇది హితకారియని జెప్పబడినది. చిరకాలమునుండియున్న వ్యాధులకిది మంచిపని జేయును. 'పేరులేని వ్యాధికి పెన్నేరుగడ్డ' యను నార్యోక్తి సర్వజనవిదితము.

శ్రీ వైద్యరత్న పండిత గోపాలాచార్యులువారి సాంప్రదాయము ననుసరించి నేను అశ్వగంధా, శతావరీ, మధుస్నుహి, శాంబా, జీరక వీని చూర్ణములను సమభాగములుగ చేర్చి లేహ్యముగ నయినను, పాలు చక్కెరలతో చూర్ణముగ నయినను, వేయించిన గోధుమలు మొదలగు వానితో చేర్చి కాఫీ కషాయమువలె పాలు చక్కెరలతోను తరుచుగ నుపయోగించుచున్నాను.

నాడ్కర్ణిలో Withania Cougulans అనియు Withania Somnifera అని రెండుజాతుల చెట్లు అశ్వగంధాలో గలవనియు, అందు మొదటి దాని గింజలు నీళ్లలో అరగదీసిగాని, ఎండుకాయలు 1 కి 40 నీళ్ళతో కషాయము పెట్టి ఆ కషాయమును గాని, గోరువెచ్చని పాలలో 100 తులములకు ఒక గురిగింజయెత్తు చేర్చిన యెడల ఒక అర ఘంటలో చక్కగ గడ్డగ పెరుగగునని వ్రాసియున్నారు. దీని నుండి జున్నుపొడిని అమెరికాలో తయారు చేయుచున్నారు.

రెండవ చెట్టుయొక్క గింజలకు పెరుగు గడ్డకట్టు గుణమున్నదిగాని కొంతవరకు విషకరము అని వ్రాసియున్నారు. నేనిది పరీక్షించలేదు. ఇందు రెండవది మత్తుకలిగించి నిద్రను పుట్టించునని నాడ్కర్ణీలోగలదు. బరోస్ వెల్కమ్ వారు ఈ మూలికను తాము పరిశోధించితిమనియు నందు మత్తు కలిగించు ద్రవ్యమేదియు లేదనియు ప్రచురించియున్నారు.

నిజమేమనగా కొంతకాలము అశ్వగంధ చేరిన మందులను క్రమముగ నుపయోగించిన యెడల అది రసాయనముగ పనిచేసి ధాతుపుష్టిని గలిగించి నిద్రను కలిగించును. కాని నిద్రను కలిగించు మత్తుమందులవలె కాదు అని నా అభిప్రాయము. ఆ. ల.]

---

# 13

## అశ్వత్థః - రావిచెట్టు. (క)

---

### భాషాంతర నామములు

హిందీ—పీపల్, మరాఠీ-పింపల, గుజరాతీ-పీంపళో, మలయాళం - అరయల్, కర్ణాటకం—అశ్వత్థ, ద్రావిడం—అరసు.

### నైసర్గిక స్వరూప వర్ణనము

రావిచెట్టు, పనస కుటుంబములోని ఉపకుటుంబమగు మఱ్ఱికుటుంబమునకు చెందినది.

**Natural Order - Moraceae.**

పనస కుటుంబము

నాడ్కర్ణీలో Ficus Religiosa ను Urticace లో చేర్చియున్నాడు. పనసను Artocarpaceae ఆర్టొకార్పేషియోలో Artocarpus integrifolia అని వర్ణించియున్నాడు. నాడ్కర్ణీ 85 వ పుట చూడుడు.

లషింగ్టన్‌లో మోరేషియో చేర్చియున్నాడు.

ఈ కుటుంబమునందు పనస, మఱ్ఱి, గంజాయి, రావి, అత్తిచెట్లు, రబ్బరుచెట్టు, జువ్వి, ఎఱ్ఱజివ్వి, పిట్టమఱ్ఱి, పుత్రజీవి, తెల్లభరణిక, గజనిమ్మచెట్టు మొదలగునవి చేరి యున్నవి.

మాదిరికి పనస వర్ణింపబడినవి.

## పనస (Artocarpus integrifolia).

ఆకులు:—ఒంటరిచేరిక, తొడిమగలదు. కణుపు పుచ్ఛములున్నవి. లఘుపత్రములు. అధశ్శిర అండాకారము. సమాంచలము. విషముఖపత్రము. పత్రము బిరుసుగా నుండును. శిరోవంతి ఆకులను దుర్రింపిన పాలుకారును.

పుష్పమంజరి:—మాను మొదటిభాగముమీద మిక్కిలి చిన్నకొమ్మలనుండి కంకులు పుట్టుచున్నవి. ఏకలింగ పుష్పములు. మగపువ్వుల కంకి మిక్కిలి చిన్నది.

మగకంకి:—పుష్పనిచోళము. రెండురేకులు మాత్రమే యున్నవి. మంచిరంగుగాని వాసనగాని లేదు.

కింజల్కములు:—ఒకటియే. కాడ లావుగనున్నది. పుప్పొడితిత్తి రెండుగదులుగలది.

ఆడుకంకి:—మగకంకికంటె గుండ్రముగా నున్నది.

పుష్పనిచోళము:—సంయుక్తము. గొట్టమువలెనున్నది. గొట్టముమూతి సన్నముగా నున్నది.

అండకోశము:—అండాశయము ఒకగది. ఒక అండముగలదు. కీలము ప్రక్కగాను కొంచెము పొడుగుగాను ఉన్నది. కీలాగ్రము లావు.

పండు:—ఒక పుష్పమువల్లనే యేర్పడుటలేదు. కంకిమీదనున్న పుష్పములన్నియు గలసి యొకపండు అగుచున్నవి. ఒక్కొక్క పుష్పము తోనలుప్రక్కల నుండెడి పీచును పుష్పములేగాని అవి గొడ్డులై యున్నవి. లేతకాయలను గోసిన పాలువచ్చును.

ఇది యొక పెద్దకుటుంబము. దీనిలో పెద్దవృక్షములు గుబురు మొక్కలు గుల్మములుగూడగలవు. ఆకులు ఒంటరిచేరిక. వానికి కణుపు పుచ్ఛములున్నవి. కొన్ని చెట్లలో కొమ్మలందును ఆకులందును పాలుగలవు. పువ్వులుచిన్నవి. ఏకలింగములు; ఏకలింగ వృక్షములుగూడ గలవు. పుష్పనిచోళము మాత్రమున్నది. కింజల్కములు సాధారణముగ పుష్పనిచోళపు తమ్మెలన్నియుండి వాని కెదురుగా నుండును. అండాశయములో నొక గది గలదు. చెట్లయందు పాలుగలవో, లేవో, ఏకలింగ పుష్పములు వేరువేరు చెట్లమీదనున్నవో కింజల్కములు మొగ్గలో వంగియున్నవో, తిన్నగనే యున్నవో మొదలగు సంశములను బట్టి యీ కుటుంబమును జాతులుగను తెగలుగను విభజించి యున్నారు. కొందరు శాస్త్రజ్ఞులు ఈ కుటుంబము మూడు నాలుగు వేరువేరు కుటుంబములుగా విడగొట్టి యున్నారు.

మఱ్ఱి ఉపకుటుంబము - Urticaceae
మాదిరికి మఱ్ఱి వర్ణింపబడినది.

మఱ్ఱి—Ficus Bengaleanses, రావి—Ficus Religiosa

ఆకులు. ఒంటరిచేరిక, లఘుపత్రములు, తొడిమ పెద్దది. కణుపు పుచ్ఛములుగలవు. అండాకారము. సమాంచలము, దట్టముగాను బిరుసుగాను నుండును.

పుష్పమంజరి—మఱ్ఱిచెట్టునకు పువ్వులు లేవనుకొనుచున్నారుగాని, ఆకులవద్ద కాయల వలె నగుపించునవి పుష్పములే. ఒక కాయవలెనగుపించునది ఒక పుష్పముగాని, ఒక కాయగాదు, పనసకంకి మీదనున్నట్లే దానిలోనుచాల పుష్పములున్నవి. ఈ సంగతి లేత వానిని త్రుంచి చూచిన తెలియగలదు. వృంతము కాడవలెనుండక, గుండ్రమై బంతివలెనై పుష్పముల నన్నిటిని నావరించుచున్నది. ఒక్కచోట మాత్రమొక రంధ్రముగలదు. ఈ రంధ్రము యొద్దకాడల వంటివి కొన్నిగలవు. అవి గొడ్డులైన పుష్పములు. పురుష పుష్పములును స్త్రీ పుష్పములును అడుగుగానున్నవి. ఇవి మిక్కిలి చిన్నవి.

పురుషపుష్పము.

పుష్పనిచోళము—కింజల్కములు వీని రేకులకెదురుగా నున్నవి. గాన నిది పుష్పకోశము. రక్షక పత్రములు నాలుగు.

కింజల్కములు ఒకటో రెండోయుండును. పుప్పొడి తిత్తులు రెండుగదులు.

స్త్రీ పుష్పములలో రెండు రకములున్నవి. కొన్నిటికాడ (ఉపవృంతము) పొడుగుగను కీలము పొట్టిగను నున్నది. కొన్నిటికాడ పొట్టిగను కీలము పొడుగుగను నున్నది.

అండకోశము:—ఒకగది. అండము ఒకటి. కీలాగ్రము లావు.

ఈ పువ్వులలో గర్భాధానము చిత్రముగ జరుగుచున్నది. కాయవంటిదానిమీద నొక రంధ్రముండుట జూచితిమిగదా! ఆ రంధ్రముద్వారా చిన్నచిన్న పురుగులు గుడ్లుపెట్టుకొనుటకువచ్చును. అవి పొట్టి కీలమున్న అండాశయములోనే గుడ్లుపెట్టును. ఆగుడ్లు పెరిగి పెద్దవై పురుగులై పైకెగిరిపోవునపుడు వాని దేహములకు కింజల్కములు తగులుచున్నవి. పుప్పొడి వాని శరీరముమీద రాలుచున్నది. ఈ పురుగులు మరియొకదానిలో బ్రవేశించునపుడు వీనిపై నున్న పుప్పొడి కీలాగ్రములపై బడుచున్నది. ఈ రీతిని చిన్నపురుగులసహాయమున గర్భధారణ పొందుచున్నవి.

## పర్యాయపదములు

శ్లో॥ బోధిద్రుః పిప్పలో౽శ్వత్థః చలపత్రో గజాశనః॥

బోధిద్రువు, పిప్పలము, అశ్వత్థము, చలపత్రము, గజాశనము అనునవి యశ్వత్థనామములు.

## అశ్వత్థగుణములు

శ్లో॥ పిప్పలో దుర్జరః శీతః పిత్త శ్లేష్మ వ్రణాస్రజిత్।
గురు స్తువరకో రూక్షో వర్ణ్యో యోనివిశోధనః॥

రావిచెట్టు కషాయరసమును, గురురూక్ష గుణములను, శీతవీర్యమును గలిగి యుండును. కష్టముగ జీర్ణమగును. వర్ణమును గలిగించును. యోనిని శోధించును. పిత్తశ్లేష్మములను శమింపజేయును. వ్రణమును, రక్తదోషమును బోగొట్టును.

## పారీషః — గంగరావిచెట్టు (ఖ)

### భాషాంతర నామములు

హిందీ—పారస్‌పీపల్, మరాఠీ—పారసపింపల, గుజరాతీ—పారస పీపళో, మలయాళం—కల్లాలు, కర్ణాటకం.—కల్లుఘోళి, ద్రావిడం-కల్లాలు.

### నైసర్గిక స్వరూప వర్ణనము

**Natural Order - Malvaceae.**

బెండకుటుంబము

గంగరావి—Theapesia populceae.

మిగిలిన వివరములకు బెండకుటుంబము చూడుడు.

### పర్యాయ పదములు

శ్లో॥ పారీషో ఽన్యః పలాశశ్చ కపిచూతః కమండలుః ।
గర్దభాండః కందరాలః కపీతన సుపార్శ్వకా॥

పారీషము, పలాశము, కపిచూతము, కమండలు, గర్దభాండము, కందరాలము, కపీతనము, సుపార్శ్వకము అనునవి పారీషనామములు.

### పారీష గుణములు

శ్లో॥ పారీషో దుర్జరః స్నిగ్ధః కృమిశుక్రకఫప్రదః ॥

గంగరావి స్నిగ్ధ గుణమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. క్రిములను బుట్టించును. శుక్రమును వృద్ధిజేయును. కఫమును వృద్ధిబొందించును.

### పారీష ఫలాది గుణములు

శ్లో॥ ఫలేఽమ్లో మధురో మూలే కషాయః స్వాదు మజ్జకః ॥

గంగరావిఫలము అమ్లరసమును, మజ్జ కషాయరసమును, మధురానురసమును, మూలము మధురరసమును గలిగి యుండును.

# నందీవృక్షః — నందీవృక్షము అశ్వత్థభేదము. (గ)

## భాషాంతర నామములు

హింది—వేలియాపీపల్, గుజరాతి—వేలియోపీపళో, మలయాళము—అట్టుకొట్టఫల, కర్ణాటకము—ఉరీయమర, ద్రావిడము—ఆడుతీండాపాళై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Mleaceae

వేప కుటుంబము

నందీవృక్షము—Cadela Tooner.

ఆకులు—ఒంటరిచేరిక. కణుపుపుచ్ఛములులేవు. మిశ్రిమపత్రిములు. పక్షవైఖరి. విషమభిన్నము. చిట్టియాకులు బల్లెపునాకారము, మొదలు వంకరగా నుండును. కొన వాలము గలదు. అంచునరంపపు పండ్లున్నవి. రెండువైపుల నున్నగ నుండును.

పుష్పమంజరి—కణుపు సందులనుండి రెమ్మగెలలు పువ్వులు చిన్నవి.

పుష్పకోశము—సంయుక్తము 5 తమ్మెలుగలవు, తమ్మెకొన గుండ్రిముగనుండును నీచము.

దళవలయము—ఆకర్షణపత్రిములు 5, నిడివిచౌకపు నాకారము.

కింజల్కములు:—కాడలన్నియు గలసి యొక గొట్టమువలె నేర్పడి యున్నవి. ఈగొట్టము లోపలివైపున పుప్పొడి తిత్తులున్నవి.

అండకోశము:—అండాశయము, ఉచ్చము. 3 గదులు. అండాశయముచుట్టు బళ్ళెరము గలదు. కీలము ఒకటి, సన్నముగా నుండును. ఫలములో పెంకుకాయ.

ఈ కుటుంబములో విస్తారము వృక్షములే గలవు. ఆకులకు గణుపుపుచ్ఛము లుండవు. ఒంటరిచేరిక, సాధారణముగ పక్షవైఖరిగ నుండును. చిట్టియాకుల మొదలు వంకరగా నుండును. పుష్పములు చిన్నవి, రక్షకపత్రిములు, ఆకర్షణపత్రిములు, అయిదేసి కలవు. అవికలసియైనను విడివడిగానైనను నుండును. కింజల్కపు కాడలన్నియు గలసి ఒక గొట్టము వలె నేర్పడును. ఈ గొట్టముయొక్క లోపలి వైపుననే పుప్పొడి తిత్తులు గలవు. అండాశయము చుట్టు బళ్ళెరము గలదు. అండాశయములో దఱుచుగా నైదు గదులుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ నందీవృక్షో ఽశ్వత్థభేదః ప్రరోహో గజపాదపః ।
స్థాలీవృక్షః క్షయతరుః క్షీరీ చ స్యా ద్వనస్పతిః ॥

నందీవృక్షము, అశ్వత్థభేదము, ప్రరోహము, గజపాదపము, స్థాలీవృక్షము, క్షయతరువు, క్షీరి, వనస్పతి యనునవి నందీవృక్షనామములు.

## నందీవృక్ష గుణములు

శ్లో॥ నందీవృక్షో లఘుః స్వాదుః తిక్తస్తువర ఉష్ణకః।
కటుపాకరసో గ్రాహీ విషపిత్తకఫాస్రజిత్ ॥

నందీవృక్షము మధురరసమును, తిక్తకటు కషాయాను రసములను, లఘు గుణమును, ఉష్ణవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. పిత్తకఫములను శమింపజేయును. విషమును, రక్తదోషమును బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు;—

(క) పరిచయబోధకములు:—(అశ్వత్థ - బోధిద్రువు, పిప్పలము, అశ్వత్థము, చలపత్రము, గజాశనము, చైత్యద్రువు, కృష్ణావాసము, దేవాత్మ, యాజ్ఞిక. (పారీష) - పలాశము, కమండలువు, గర్దభాండము. (నందీవృక్ష) ప్రరోహము, గజపాదపము, స్థాలీవృక్షము, క్షయతరువు, క్షీరి, వనస్పతి.

(ఖ) గుణబోధకములు:—(అశ్వత్థ)—పవిత్రక.

(2) శబ్దార్థములు:—

బోధిద్రువు—తెలియజేయునట్టి వృక్షము అనగా నీ వృక్షముక్రింద సమాధి నిష్ఠులై తపస్సు జేసిన మోక్షమార్గమును దెలియ గలుగుదురని భావము. పిప్పలము - క్షీరరూపమున ద్రవమును గలిగి యుండునది. అశ్వత్థము-వటాది వృక్షముల వలె చిరకాలము జీవింపనట్టిది. చలపత్రము - ఎల్లప్పుడును చలించునట్టి పత్రములను గలది.

గజాశనము—ఏనుగులచే దినబడునట్టి పత్రములను గలది. చైత్యద్రువు - యజ్ఞశాలలందు బెంచబడునట్టి వృక్షము. కృష్ణావాసము- కృష్ణునకు నివాసముగా నుండునది. దేవాత్మ - త్రిమూర్తి స్వరూపమైనట్టిది. యాజ్ఞిక - యజ్ఞములందు సమిధలుగా నుపయోగింపబడునట్టిది. పలాశము - చలించునట్టి యాకులనుగలది. కమండలువు- జలరూపమగు సారమునుగలది. గర్దభాండము- గర్దభాండము ననుకరించు ఫలములను గలది. ప్రరోహము- విరివిగ నుత్పత్తి యగునది. గజపాదపము - ఏనుగులచే దినబడునట్టి యాకులను గలది. స్థాలీవృక్షము - స్థాలివలె నుపయోగింపబడునట్టి వృక్షము (లేక) మంటితొట్ల యందు పెంచబడునట్టి వృక్షము. క్షయతరువు - క్షీణించునట్టి స్వభావముగల

వృక్షము క్షీరి - పాలుగలిగి యుండునది. వనస్పతి - వనస్పతి గణములో (పుష్పములు లేకనే ఫలించునట్టి వృక్షములలో గణింపబడునది. పవిత్రక — పవిత్రమును జేయునది.

(3) భేదములు:—

ఇవి "అశ్వత్థము, క్షుద్రాశ్వత్థము, పారీషము, నందీవృక్షము" అని నాలుగు విధములుగా నుండునట్లు గానబడును. ఇవి యెత్తుగా బెరుగు వృక్ష జాతులలో నుత్పత్తి గలిగి క్షీరివృక్షములలో గణింపబడు చున్నవి.

అందు అశ్వత్థము అనునది దీర్ఘమగు నాళముతో గూడి, ముక్కోణా కృతిగ నుండి కోణమునందు దీర్ఘమగు అగ్రభాగమును గలిగి విశాలముగ నుండు పత్రములతో నొప్పి యుండును. ఈ నాళముయొక్క మూలభాగ మున ఆకును తుంపినచో తెల్లనిపాలు గానుపించును. ఈ పత్రము లెల్లప్పు డును చలించు స్వభావము గలిగి యుండును. మరియు నీ పత్రనాళముల మూలభాగమున శాఖమునంటి గుండ్రని చిన్న చిన్నకాయ లుత్పత్తి యగును. ఈ చెట్టుయొక్క లేత కొమ్మలను ఏనుగులకు ఆహారముగా నిచ్చు దురు. ఇంతియే గాకుండ దీని యాకులను మేకలు గూడ దినును. ఈ వృక్షము లెల్లచోటుల నుత్పత్తి యగును. కాని ప్రతి గ్రామమునందును ధర్మచావడి యను పేరుతో జనులు కూర్చుండుటకు వీలగునట్లు గట్టబడిన నెత్తుగ విశాల ముగ నుండు మంటిదిబ్బల మధ్య నీ వృక్షమును పాతి బెంచుదురు. అయితే నీ వృక్షమును రాత్రులందు భూతము లాశ్రయించునని యా కాలములం దెవరును దీని క్రింద కూర్చుండరు గాని పగలు మాత్రము విశేషముగా దీని ఛాయయందు ఎల్లగను గూర్చుని కాలక్షేపము జేయుచుందురు. మరియు నీ వృక్షమునకును నింబవృక్షమునకును (రెండింటిని గలిపి యొకచో పాతి పెంచినట్టి వానికి) వివాహముజేయుట ధార్మికుల ధర్మకార్యములలో నిది యొకటిగా వ్యవహారము నందు గానుపించును.

ఇంతియే గాకుండ "మూలతో బ్రహ్మరూపాయ మధ్యతో విష్ణు రూపిణే। అగ్రతః శివరూపాయ వృక్షరాజాయతే నమః" యని యిది త్రిమూర్తి స్వరూపమనియు, దీని సేవించిన సర్వకామితములను బొందవచ్చు ననియు దలచి కామితార్థులగు గొందరు గృహస్థులు దీనిని ప్రతి నిత్యమును ప్రదక్షిణ పూర్వకముగ నర్చించు చుందురు. మరియు బ్రయాగాది పుణ్యా

క్షేత్రములలో గంగానదీ కూలస్థములగు నీ యశ్వత్థవృక్షముల నర్చించుటకై తీర్థయాత్రాపరులు బోయి యచ్చట వీని మూలములందు అర్చన జేయుదురు. ఇటుల జేయుటవలన వారి వారి పితృదేవతలకు ముక్తి సంప్రాప్తించునని శ్రుతులందు వర్ణింపబడినట్లుగ దెలియగలదు. మరియు భగవద్గీతాదులందు దీని ప్రభావము విశేషముగా వర్ణింపబడినది. ఇటుల వ్యవహారములందనేక విధములుగ నీ యశ్వత్థముయొక్క ప్రయోజనము గానబడుచున్నది. వైద్యము నందు గూడ దీని పట్ట అనేక విధములుగా నుపయోగింపబడు చున్నట్లు దెలియగలదు. అందు విశేషముగా ప్రదరాది గర్భాశయ వ్యాధులందు స్తంభనాది క్రియలకును, వ్రణములందు రోపణమునకును బ్రయోగింప బడుచున్నది.

క్షుద్రాశ్వత్థము అనునది "క్షుద్రపత్రాశ్వత్థవృక్ష" మని వైద్యకశబ్దసింధువునందును, "లఘుపత్ర, హ్రస్వపత్ర, వనస" యని రాజనిఘంటువు నందును జెప్పబడి యుండుటనుబట్టి పైని వర్ణింపబడిన యశ్వత్థపత్రములకంటె మిగుల చిన్నవియగు పత్రములను గలిగి వనములందు బెరుగు నొక యశ్వత్థ భేదముగా దెలియగలదు. ఇది రాజనిఘంటుకారునిచే దప్ప మిగిలిన నిఘంటుకారులచే గ్రహింపబడినట్లు గానరాదు. అయితే నిదియు పైదానివలెనే కషాయరసాదిగుణములను గలిగి విశేషముగా గర్భిణీవ్యాధులందుపయోగింప బడునట్లుగా దెలియగలదు.

పారీషము అనునదిగూడ విశేషముగ ప్రతిచోటున నుత్పత్తియగుచుండును. దీని యాకులు రావియాకులవలె నుండును గాని కొంచెము మృదుత్వమును గలిగియుండును. దీని పుష్పములు గంటవలె నాకృతిని గలిగి ముదగను పసపు పచ్చనివర్ణము గలిగియు నుండును. ఇదిగూడ క్షీరమును గలదగుటచే క్షీరవృక్షములలో వేతసమునకు బదులుగా నుపయోగింపబడుచున్నది. దీనికి రావిచెట్టువలె వ్యవహారము నందంతగా ప్రయోజనమున్నట్లు గానబడదు. వైద్యమునందుగూడ పై విధముగ క్షీరివృక్షములలో నొక దానికి బదులుగ నుపయోగింపబడుట దప్ప నితరత్ర స్వతంత్రముగ నుపయోగింపబడు చున్నట్లును దెలియరాదు.

నందీవృక్షము అనునది "అధోముఖ పత్రశాఖే అశ్వత్థభేదే, కొంకణదేశ ప్రసిద్ధే సుగంధవృక్ష విశేషే" యని వైద్యకశబ్ద సింధువునందు జెప్పబడి యుండుటచే (నీ వృక్షము) నధోముఖముగనుండు పత్రములను శాఖలను గలిగి

యుండి యిదియొక యశ్వత్థభేదముగా నుండుననియు, నిది కోంకణదేశము నందు విశేషముగా నుత్పత్తిగలిగి పరిమళముతో గూడి యుండుననియును తెలియగలదు. అయితే దీని స్వరూపమును స్పష్టముగా బోధించు విశేషము లింతకంటె హెచ్చుగ నెందును గానరాకున్నవి. మరియు నిది "వనస్పతి" యని జెప్పబడుటచే "అపుష్పాః ఫలవంతో వనస్పతయః" (సు-సూ-అ 1.) నది పుష్పించకుండగనే ఫలించునట్లు దెలియగలదు. అశ్వత్థ వృక్షమునకు గూడ పుష్పములు లేకపోవుటచే నిదియు వనస్పతి జాతులలోని దనియే చెప్పవచ్చును.

(4) విశేష గుణములు:—

(క) అశ్వత్థ - మధురరసమును, కషాయానురసమును గలిగి యుండును. దాహమును బోగొట్టును. రా-ని. తిక్తానురసమును గలిగి యుండును. ని-ర.

(ఖ) అశ్వత్థపక్వఫలము - శీతవీర్యమును గలిగి యుండును. విశేషముగ హృదయమునకు హితమైనది. రక్తపిత్తము, విషము, దాహము, ఛర్ది, శోష, అరుచి వీనిని బోగొట్టును. రా-ని.

(గ) క్షుద్రాశ్వత్థము - కషాయరసమును, మధురానురసమును గలిగి యుండును. విశేషముగ గర్భిణికి హితమైనది. రక్తపిత్తమును, విషమును, దాహమును బోగొట్టును. రా-ని.

(ఘ) పారీషము - వెంటనే శుక్రమును గలిగించును. మ-ని. వాతపిత్తములను శమింపజేయును. హృద్రోగమును, దాహమును, కంఠరోగమును బోగొట్టును. ని-ర.

(చ) నందీవృక్షము - శీతవీర్యమును గలిగి యుండును. పరిమళమును గలిగి యుండును. ధాతుపుష్టిని, వీర్యమును గలిగించును. దాహమును, శిరశ్శూలను, శ్వేతకుష్ఠమును బోగొట్టును. రా-ని. లఘుగుణమును గలిగియుండును. త్రిదోషములను శమింపజేయును. వ్రణమును, కుష్ఠమును, రక్తపిత్తమును, కండువును బోగొట్టును. ని-ర.

(5) ప్రయోగములు:—

1. వాతరక్తమునందు అశ్వత్థ ప్రయోగము.

"బోధిద్రుమ కషాయం తు పిబేత్తం మధునా సహ।
వాతరక్తం జయత్యాశు త్రిదోష మపి దారుణం"॥

రావిచెక్క కషాయమును తేనెతో జేర్చి సేవించిన వాతరక్తము శమించును. చ-చి-అ 29.

2. వ్రణమునందు అశ్వత్థ ప్రయోగము.

"పిప్పలస్య చ వ్రణప్రచ్ఛాదనే హితాః" ॥

రావియాకులను వ్రణములపై ఆచ్ఛాదనము చేసిన శీఘ్రముగ రోపణ మగును. చ-చి-అ 13.

3. వ్రణమునందు అశ్వత్థ ప్రయోగము.

"కకుభోదుంబరాశ్వత్థ...త్వచమాశ్వేవ ।
గృహ్ణంతి త్వక్చూర్ణైః చూర్ణితావ్రణాః" ॥

మద్దిపట్ట, అత్తిపట్ట, రావిపట్ట వీని చూర్ణమును వ్రణములపై అవచూర్ణనము జేసిన శీఘ్రముగ చర్మము కలుసుకుని మానును. చ-చి-అ 13

4. ప్రమేహమునందు అశ్వత్థ ప్రయోగము.

"నీలమేహినం అశ్వత్థకషాయం వా పాయయేత్"

రావిచెక్క కషాయమును సేవించిన నీలమేహము శమించును.

సు-చి-అ 11.

5. వాజీకరణమునకై యశ్వత్థ ప్రయోగము.

"అశ్వత్థ ఫలమూలత్వ గ్శుంగసిద్ధం పయోనరః ।
పీత్వా సశర్కరా క్షౌద్రం కులింగ ఇవ హృష్యతి"

రావిచెట్టుయొక్క-ఫలములు, మూలము, పట్ట, ఊడలు వీనితో గాచిన పాలయందు చక్కెరను తేనెను జేర్చి సేవించిన వాజీకరణమగును. సు-చి-అ 26.

6. భగ్నవ్రణమునందు అశ్వత్థ ప్రయోగము.

అశ్వత్థ పలాశ కకుభ త్వచః కుశార్థ ముపసంహరేత్"

రావి, మోదుగ, మద్ది వీని పట్టలను భగ్నవ్రణములపై నుంచి కట్టు కట్టిన శీఘ్రముగ రోపణమగును. సు-చి-అ 3.

7. కర్ణరోగమునందు అశ్వత్థ ప్రయోగము.

"పత్రాణాం పృథగశ్వత్థ బిల్వార్కైరండ జన్మనాం ।
తైలసింధూత్థ దిగ్ధానాం స్విన్నానాం పుటపాకతః ॥
రసైః కవోష్ణైః పూరయేత్" ॥

రావి, మారేడు, జిల్లేడు, ఆముదపుచెట్టు వీనియొక్క పత్రములను గ్రహించి తిలతైలమును సైంధవలవణమును బాగుగా గలిపి దీనితో వానికి ప్రత్యేకముగా లేపనము జేసి పుటపాకవిధి ననుసరించి పాకము జేసి యందుండి స్వరసమును గ్రహించి సుఖోష్ణముగ నున్నప్పుడు కర్ణపూరణము జేసిన కర్ణరోగము శమించును. వా_ఉ_అ 18

8. వ్రణశోథయందు అశ్వత్థ ప్రయోగము.

"న్యగ్రోధోదుంబరాశ్వత్థ...వల్కలైః।
ప్రదేహో భూరిసర్పిర్భిః శోథ నిర్వాపణః పరం" ॥

మర్రి, అత్తి, రావి వీనియొక్క పట్టలను మెత్తగా నూరి అందు హెచ్చుగ ఘృతమును గలిపి వ్రణశోథకు ప్రదేహము జేసిన శోథనిర్వాపణ మగును. వా_ఉ_అ 25.

9. గర్భలాభార్థము అశ్వత్థ ప్రయోగము.

"అథవాశ్వత్థ వందాకం గర్భదం క్షీరపాచితం" ॥

రావిచెట్టుపై మొలచిన బదనికతో గాచిన పాలను సేవించిన గర్భప్రద మగును. వై.

10. వమనమునందు అశ్వత్థ ప్రయోగము.

"అశ్వత్థవల్కలం శుష్కం దగ్ధ్వా నిర్వాపితం జలే।
తత్తోయపాన మాత్రేణ ఛర్దిం జయతి దుస్తరామ్"॥

ఎండిన రావిపట్టను బాగుగా గాల్చి జలమునందు గలిపి కొంతకాల ముంచిన పిమ్మట పైకి తేరినట్టి ద్రవమును వడియగట్టి పానము జేసిన వెంటనే దుస్తరమగు ఛర్దిగూడ శమించును. చ_ద.

11. అగ్నిదగ్ధ వ్రణమునందు అశ్వత్థ ప్రయోగము.

"అశ్వత్థస్య విశుష్కవల్కల కృతం చూర్ణం తథా గుండనాత్" ॥

ఎండిన రావిపట్టయొక్క మృదుచూర్ణమును అగ్నిదగ్ధ వ్రణముపై నవచూర్ణనము జేసిన శీఘ్రముగ మానును. చ_ద.

12. శిశువుల ముఖపాకమునందు అశ్వత్థ ప్రయోగము.

"అశ్వత్థత్వగ్భవః క్షౌద్రైః ముఖపాకే ప్రలేపనం" ॥

రావిపట్ట చూర్ణమును తేనెతో గలిపి బాలుర నోటిపూతకు లేపనము జేసిన శమించును. చ_ద.

(6) యోగములు:—

1. అశ్వత్థాది లేపము - భైషజ్య - సర్వోవర్ణి.
ఉపయోగములు:—లేపనము జేసిన సర్వోవర్ణము శమించును.
2. అశ్వత్థాది లేపము భైషజ్య - గలగండాది.
ఉపయోగములు:—లేపనము జేసిన అపచీవర్ణము శమించును.
3. అశ్వత్థాది క్వాథము - గ-ని-ప్రమేహ. మాత్ర:—1 పలం.
ఉపయోగములు:—సమస్త ప్రమేహములు శమించును.
4. అశ్వత్థాది కషాయము. వై-చిం-జ్వ. మాత్ర:—1 పలం.
ఉపయోగములు:—శీతజ్వరము శమించును.
5. అశ్వత్థాది కషాయము - శార్ఙ-మ-అ 2.
ఉపయోగములు:—(వ్రణ) ప్రక్షాళనముజేసిన వ్రణశోథ, ఉపదంశము ఇవి శమించును.
6. అశ్వత్థబీజాది చూర్ణము- సహస్రయోగ-చూర్ణ. మాత్ర:-$\frac{1}{4}$తులం.
ఉపయోగములు:—సర్వప్రమేహములును శమించును.

స్వానుభవము.

నేను అనుదినము ప్రదరాదులయందుత్తర వస్తికని, వ్రణమును కడుగుటకును రావిపట్ట కషాయమును ధారాళముగనుపయోగించుచున్నాను. ఈ కషాయమునే తేనెగలిపి నోటిపూతకును, మెత్తని చూర్ణమును వ్రణములపై చల్లుటకు నుపయోగించుచున్నాను. మంచి గుణము నిచ్చుచున్నది. నాగార్జునలో పండ్లు, మృదువిరేచన కారియనియు గింజలు లేహ్యముగను చూర్ణముగను ఈయవచ్చుననియు, పట్ట కషాయము గనోరియా (పూయామేహము) నందు లోపలికిచ్చుట యుపయోగమనియు చెప్పబడియున్నది. రావి చిగుళ్లు పాలలో వేసి కాచి చక్కెరకలిపి ఇచ్చినయెడల శీతవీర్యమనియు బృంహణమనియు జెప్పబడియున్నది. (ఆ.ల.)

# 14

# అసనః - వేగిసచెట్టు

## భాషాంతర నామములు

హిందీ—అసన, మరాఠీ—అసాణా, గుజరాతీ-బీయో, మలయాళం-వేంగా, కర్ణాటకం—బేగె, హిరయహొన్నెమరను, ద్రావిడం—వెంగై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Leguminosae

చిక్కుడు కుటుంబము.

వేగిస—Ptero Carpus Mursupeum

ఈ కుటుంబమునందు చిక్కుడుతీగె, అనపచిక్కుడు, అడవి చిక్కుడు, కంచి చిక్కుడు, గోరుచిక్కుడు, పెసర, కుంకుమ పెసలపంట, పిల్లిపెసర, మినుము, శనగ, ఉలవ, బొబ్బర, అనప, బటాణి, వేరుశెనగ, మెంతి, నీలిమందు, కరినీలి, వరినీలి, జనుము, చింత, సీమచింత, నల్లతుమ్మ, తెల్లతుమ్మ, కస్తూరితుమ్మ, ఖదిరవృక్షము, షీకాయి చెట్టు, గానుగచెట్టు, దిరిశనచెట్టు, సిద్ధిగన్నేరుచెట్టు, గురివింద, రక్తచందనము, చందనము, బాడిత, విరుగుడుచేవ, బాడిదము చెట్టు, అవిసిచెట్టు, కాంచనవృక్షము, వనరాజము, తంగేడుమొక్క, సునాముఖి, అడ్డాకులతీగె, మోదుగ, తీగెమోదుగ, కసింతమొక్క, నూతి కసింత, రేలమొక్క, తీటకసింత, నేలరేసు, నీరుజీలుగ, ఎఱ్ఱజీలుగు, నల్లజీలుగ, కొండగిలిగిచ్చ, నల్లగిలిగిచ్చ, నల్లగరిగిలిగిచ్చ, పెద్దగిలిగిచ్చ, కూనగిలిగిచ్చ, నాగగిలిగిచ్చ, నీరుగిలిగిచ్చ, గచ్చపొద, నూనిగచ్చ, బుక్కాచెట్టు, తురాయి, చెమ్మతీగె, అలచంద, కరిఅల్చంద, కనపద్ద, నల్లబెండ, తెల్లతీగె, కరకందితీగె, చరగదము, దద్రుఘ్నము, కిష్టకుమార, నూనిగిలక, వలకదూడ, అమెరమొక్క, నల్లపర్ని, నల్లసావకాడ, నల్లపాతేరు, శాయిలికంప, గలుగతీగె, జయంతి, దూలగొండి, పెద్దదూలగొండ ఈ మొదలగునవి చేరియున్నవి, మిగతా వర్ణనమునకై వనౌషధవిజ్ఞానము (యీ పుస్తకములోని 23, 24 పేజీలుచూడుము).

## పర్యాయపదములు

శ్లో॥ బీజకః పీతసారశ్చ పీతసాలక ఇత్యపి।
బంధూకపుష్పః ప్రియకః సర్జః శ్చాసనః స్మృతః॥

బీజకము, పీతసారము, పీతసాలకము, బంధూక పుష్పము, ప్రియకము, సర్జకము, అసనము అనునవి అసననామములు.

## అసనగుణములు

శ్లో॥ బీజకః కుష్ఠవిసర్ప శ్విత్రి మేహ గుదక్రిమీన్ ।
హన్తి శ్లేష్మ స్రపిత్తం చ త్వచ్యః కేశ్యో రసాయనః ॥

వేగిస చెట్టు చర్మమునకు మృదుత్వమును గలిగించును. కేశములను వృద్ధి పొందించును. రసాయనము, శ్లేష్మమును శమింపజేయును. కుష్ఠము, విసర్పము, శ్విత్రకుష్ఠము, ప్రమేహము, గుదజక్రిములు, రక్తపిత్తము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధ నామములు:—

(క) పరిచయ బోధకములు:—పీతసారము, పీతసాలకము, బంధూక పుష్పము, సర్జకము.

(ఖ) గుణబోధకములు:—ప్రియకము, అసనము.

(2) శబ్దార్థములు:—

పీతసారము - పసుపుపచ్చని సారమును గలది. పీతసాలకము - పసుపు పచ్చని వర్ణము గలిగి సాలవృక్షమును అనుకరించునది.

బంధూకపుష్పము - మంకెనపువ్వువంటి పువ్వులను గలది. సర్జకము- ఒక విధమగు నిర్యాసమును బయటకు విడుచుచున్నది. ప్రియకము - తృప్తిని గలిగించునది. అసనము - రోగములను బోగొట్టునది.

N. B:—ఇది యెత్తుగా బెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి సార సారములలో గణింపబడు చున్నది. పై పదములను బట్టి యిది యొకవిధమగు నిర్యాసమును విడుచుచుండుననియు నది పసుపుపచ్చని వర్ణమును గలిగి యుండు ననియును, దీని పుష్పములు మంకెన పుష్పములవలె నుండుననియును దెలియ గలదు. మరియు శాలిగ్రామ నిఘంటు నిరూపణమును బట్టి దీని యాకులు పిప్పలి పత్రములవలె నుండుననియును దెలియగలదు. అయితే వైద్యకశబ్ద సింధువునందు దీని యాకులు ఛాగకర్ణము (మేకచెవుల) వలె నుండునని జెప్ప బడి యిది సాలవృక్షములో నొక భేదముగా నిరూపింపబడినది, ఇదియును గాక యిందలి పీతసాలకము, సర్జకము, అను పదములను బట్టి గూడ సాల వృక్షములో నిది యొక భేదమై (పచ్చని సాలవృక్షము) యుండునట్లును దెలియు చున్నది. ఒకవేళ దీనిని సాలవృక్షభేదముగా నిశ్చయించుదమన్నను

తగినంత యాధారము గానుపించకున్నది. అయినను విమర్శపై గాని యేదియై యుండునదియు దీనిని నిశ్చయించుటకు శక్యముగాదు.

(3) విశేష గుణములు:—

కషాయరసమును గలిగి యుండును. ధ-ని. కటురసమును, తిక్తానురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. వాతమును శమింపజేయును. వాతరోగమును, గళరోగమును రక్తమండలమును బోగొట్టును. రా-ని.

(ఖ) పుష్పము:- తిక్తరసమును, మధురవిపాకమును గలిగి యుండును. ఆమమును బాకము జేయును. వాతమును వృద్ధిబొందించును. ని-ర.

(4) ప్రయోగములు:—

**1. రక్తపిత్తమునందు అసన ప్రయోగము.**

"తథా మధూకస్య తథాసనస్య క్షారాః ప్రయోజ్యాః విధినైవ తేన"

ఇప్ప, వేగిస వీనియొక్క క్షారముల నుక్తవిధి ననుసరించి యిచ్చిన రక్తపిత్తము శమించును. చ-చి-అ 4.

**2. రసాయనమునకు అసనప్రయోగము.**

"ఖదిరశింశపాసన స్వరసాః, తేషాం స్వరసాః
నాగబలావత్ స్వరసానా మలాభే త్వయం స్వరస విధిః।
చూర్ణానా మాఢక ముదక స్యాహోరాత్రోషితం।
మృదిత పూతం స్వరసవ త్ప్రయోజ్యం"॥

చండ్రి, ఇరుగుడుచెట్టు, వేగిస వీని స్వరసములను గ్రహించి లేక స్వరసాభావమునందు నాగబలవలె చండ్రి మొదలగు వాని చూర్ణమును, జలమును ఒక్కొక్క ఆఢకము చొప్పున గ్రహించి రెండింటి నేకముగా గలిపి యొక అహోరాత్రము లూరబెట్టి మెత్తగా నూరి గుడ్డయందు వడియగట్టి యట్టి స్వరసమును గ్రహించి గాని యుపయోగించిన మిగుల రసాయనమగును. చ-చి-అ 1.

**3. కుష్ఠమునందు అసన ప్రయోగము.**

"యథాసర్వాణి కుష్ఠాని హతః ఖదిరబీజకా"

చండ్రి, వేగిస వీని సారములను సేవించిన సమస్త కుష్ఠములు శమించును. సు-చి-అ 1.

4. నేత్రబలమునకై అసన ప్రయోగము.

"తిలతైల మక్షతైలం భృంగస్వరసో౽ సనాచ్ఛ నిర్యూహః ।
ఆయసపాత్రే విపక్వం కరోతి దృష్టేః బలం నస్యం"

తిలతైలము, తనికాయనుండి తీసిన తైలము, గుంటకలగరాకు స్వరసము, వేగిస కషాయము వీనిని యథాయోగముగ గ్రహించి యినుపపాత్రలో తైలపాకము జేసి దీనితో నస్యము జేసిన నేత్రములకు బలము గలుగు.

వా-ఉ-అ 13.

5. ఉపదంశమునందు అసన ప్రయోగము.

"క్వాథం పిబే ద్వా ఖదిరాసనాభ్యాం సగుగ్గులుం వా
త్రిఫలాయుతం వా। సర్వోపదంశాపహరః ప్రయోగః"

చండ్ర, వేగిస వీని కషాయమునందు శోధిత గుగ్గులును గాని, త్రిఫలా చూర్ణమును గాని జేర్చి సేవించిన సర్వోపదంశములును శమించును. వం-సే.

6. స్థౌల్యమునందు అసన ప్రయోగము.

అతిస్థూల శరీరోయః తిలతైలం ప్రగేపిబేత్ ।
పిబేదసన సారస్య క్వాథం వా మధుసంయుతం ॥

వేగిససార కషాయమునందు తేనెను జేర్చి సేవించిన స్థూలత్వము శమించును. వై-మ.

7. శ్లీపదమునందు అసన ప్రయోగము.

"ఖదిరాసన శాలానాం సారకల్కం పిబేన్నరః ।
పాతరగ్రవాం హి మూత్రేణ సక్షౌద్రం శ్లీపదం జయేత్ ॥ "

ప్రతిరోజున నుదయమున చండ్ర, వేగిస, సాలవృక్షము వీని యొక్క సారకల్కమును గోమూత్రమునందు జేర్చి అందు తేనె గలిపి సేవించుచుండిన శ్లీపదము శమించును. గ-ని.

8. పశ్చాదుబ్జమను బాలరోగమునందు అసన ప్రయోగము.

"అసనస్య తు పుష్పాణి శ్లక్ష్ణ చూర్ణాని కారయేత్ ।
గుటికాం కారయే ద్వైద్యః తాంచ భక్తస్య వారిణా ॥
ఏషాం పశ్చాత్త కేదద్యా ద్బాలేషు మతిమాన్ భిషక్ ॥ "

వేగిసపువ్వులను మెత్తగా చూర్ణించి అన్నపుగంజితో మెత్తగా నూరి చిన్న చిన్న మాత్రలను జేసి యిచ్చిన యెడల బాలురకు గలుగు దారుణమగు పశ్చాదుబ్జమను వ్యాధి శమించును. వం-సే.

(5) యోగములు:—

1. అసనఖదిరాది రసాయనము - వా-ప్రమేహ. మాత్ర:-1 తులం
ఉపయోగములు:—ప్రమేహము, గండమాల, అర్బుదము, గ్రంధి, స్థౌల్యము, కుష్ఠము, భగందరము, క్రిమిరోగము, శ్లీపదము, శోఫ ఇవి శమించును. మిగుల రసాయనము.

2. బీజకాష్టము - చ-పాండు. మాత్ర:—1 ఔన్సు.
ఉపయోగములు:—గ్రహణి, పాండు, అగ్నిమాంద్యము, శోఫ, గుల్మము, మూత్రకృఛ్రము, అశ్మరి, ప్రమేహము, కామిల, సన్నిపాతము ఇవిశమించును.

3. అసనాది గణక్వాథము - వా-సూ-అ 15. మాత్ర:-1 పలం.
ఉపయోగములు:—కఫము, శ్విత్రకుష్ఠము, కృమిరోగము, పాండువు, ప్రమేహము, మేదోవృద్ధి ఇవి శమించును.

This tree is the source of the kino of the European Pharmacopoeas. The principal constituent of kino is a peculiar tannin-kino tannic acid 70 to 80 p.c., usually behined to be indentical with cateahu tannic acid and distinct from gallow tonnic acid. Kino is a simple astringent, administered in diarrhoea; some what milder in action than catechu. The bark is used id powder or decoction in diarrhoea, pyrosis etc. (Nadkarni. It is also used in chronic dysentery when astringents are admissable; in leucorrhea and diabetes; and in passive hemorrhages, particularly those from the uterus and the intestines). United States Dispensatory.

స్వానుభవము

వేగిసచెట్టు యొక్క సారము ఖది సారమువలెనే కషాయరస ప్రధానముగా నుపయోగించదగినది. బ్రిటిష్ ఫర్మకోపియాలో కైనో (Kino) అను ద్రవ్యము ఇదియే. గ్రహణి, అతిసారము, ప్రమేహము, రక్తస్రావము శ్వేతరక్త ప్రదరము లందుపయోగము.

మోతాదు:—సారము 5 మొదలు 15 గురిగింజలు. చేవ కషాయము 2 మొదలు 4 ఔన్సులు. (ఆ. ల.)

# 15

# అపామార్గ - ఉత్తరేణి.

---

## భాషాంతర నామములు

హిందీ—ఓంగా, చిరచిటా, లటజీరా, మరాఠి—అఘాడా, గుజరాతీ—అంఘేడో, మలయాళం—కడలడి, కర్ణాటకం-ఉత్తరేణి, ద్రావిడం-నాయురివి.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Amarantaceae

### తోటకూర కుటుంబము

### ఉత్తరేణి—Achyranthus aspera

ఈ కుటుంబమునందు తోటకూర, చిలకతోటకూర, ముళ్లతోటకూర, కొయ్యతోటకూర, పొన్నగంటికూర, దుగ్గలకూర, చిరకూర, కోడిజుట్టుమొక్క, చెంచెలిమొక్క, ఉత్తరేణి, సొగడ బంతి మొక్క యీ మొదలగునవి చేరియున్నవి.

పత్రికాండము—గుల్మము - నున్నగాను పొడుగుగాను నుండును.

ఆకులు:—ఒంటరిచేరిక, లఘుపత్రములు. అండాకారము. సమాంచలము, రెండు వైపులనున్నగా నుండును. విషమరేఖపత్రము. కొనగుండ్రము. తొడిమ పొడుగుగా నుండును.

పుష్పమంజరి:—కణుపుసందులనుండిగాని, కొమ్మల చివరనుండిగాని కలుగును. పువ్వులాకుపచ్చగను, చిన్నవిగనున్నవి. అపంపూర్ణము ఏకలింగపుష్పములు.

పుష్పనిచోళము:—అసంయుక్తము, 3 దళములు. సన్నముగా నున్నవి. నీచము.

పురుష పుష్పము:—కింజల్కము 5: అయిదుకంటె తక్కువకూడ కలుగుచుండును. పుప్పొడి తిత్తులు రెండుగదులు.

స్త్రీ పుష్పము:—పుష్పనిచోళము — పై దానియందువలె నుండును. అండకోశము ఉచ్చము, 2 గదులు. కాయ పేటికాఫలము గింజలు గుండ్రముగా నుండును.

ఈ కుటుంబములోనివన్నియు గుల్మములే. ఆకులు ఒంటరిచేరిక వానికి కణుపుపుచ్ఛములుండవు. వీని పువ్వులన్నియు చిన్నవే. వానికే మంచిరంగుగాని సువాసనగానిలేదు. కొన్ని ఏకలింగపుష్పములే. కింజల్కములు 5, గావి తక్కువగావి యుండును. కొన్నిటిలో గొడ్డుకింజల్కములుకూడగలవు. ఈ కింజల్కములు పుష్పనిచోళపు పత్రముల కెదురుగా నుండునుగాన, ఆ పుష్పనిచోళమును పుష్పకోశముగా నెన్నవచ్చును. కొన్నిటిలో పుప్పొడి

తిత్తులోకొక్కటియే; ముఖ్యముగాన భేదమునుబట్టియే నీ కుటుంబమును విభజించియున్నారు. వీని ఫలములు పేటికాఫలములు.

ఉత్తరేణి పలుచోట్ల మొలచుచున్నది. దీని కంకి చాల పొడగుగా నుండును. కాయలు పుష్పకోశములోనే యుండును. కాయలు ముదరగనే అవి (పుష్పకోశములు) తలక్రిందులుగ వంగును. అట్లు వంగియుండుటవలన మన బట్టలకు, వానికేమి తగిలినవాని నన్నిటి నంటుకొని, కంకినుండి విడుటకు వీలుగనున్నది. అవ ఏగొఱ్ఱెనో ఏబట్టనో అంటుకొని ఎక్కడ నయినను రాలినయెడల నచ్చట మొలచును. ఇదియే వానికి గావలశినది. ఇట్లే అవి సాధారణముగ వ్యాపకము జెందుచున్నవి.

## పర్యాయపదములు

శ్లో॥ అపామార్గస్తు శిఖరీహ్యాధశ్శల్యోమయూరకః।
మర్కటీ దుర్గ్రహాచాపి కిణిహీ ఖరమంజరీ॥

అపామార్గము, శిఖరి, అధశ్శల్యము, మయూరకము, మర్కటి, దుర్గ్రహా, కిణిహి, ఖరమంజరి అనునవి అపామార్గ నామములు.

### రక్తాపామార్గః = ఎఱ్ఱఉత్తరేణి

శ్లో॥ రక్తోఽన్యో వశిరోవృత్త ఫలోధామార్గవోపిచ।
ప్రత్యక్పర్ణీ కేశపర్ణీ కథితా కపిపిప్పలీ॥

వశిరము, వృత్తఫలము, ధామార్గవము, ప్రత్యక్పర్ణి, కేశపర్ణి, కపిపిప్పల యనునవి రక్తాపామార్గ నామములు.

(I) శబ్దార్థములు:—

అధశ్శల్యము = అధోభాగమునకు అగ్రము లుండునట్లుగా వంగినట్టి కంటకములను గలది; మయూరకము = నెమలిపింఛమువలె పొడవుగానుండునట్టి పుష్పములతో గూడిన కాండమును గలది; దుర్గ్రహము = స్పృశించుటకు శక్యముగానట్టి మంజరితో గూడి యుండునది; ఖరమంజరి = తీక్ష్ణముగ నుండు ముండ్లతో గూడిన పూలగుత్తిని గలది; క్షారమధ్యా = మధ్యభాగమునందు క్షారముతోగూడి యుండినది; అధ్వశల్యా = దారినడచువారికి శల్యమువలె తోచునది. మాలాకంటక = మాలవలెనుండు కంటకములతోగూడినది. వృత్తఫలము = గుండ్రముగ నుండునట్టి ఫలములనుగలది; ప్రత్యక్పర్ణి = క్రిందికి వంగినట్టి పత్రములను గలది; కపిపిప్పల = నల్లగనుండు బీజములను గలది; క్షుద్రాపామార్గ = మిగులపొట్టిగా నుండునది; ఖరచ్ఛద = ఖరముగ

నుండు పత్రములను గలది; అపామార్గము = దోషములను వెలిబుచ్చునది; కిణిహి = వ్రణములను బోగొట్టునది.

(2) గుణములు:—

శ్లో॥ అపామార్గస్సర స్తీక్ష్ణో దీపన స్తిక్తకః కటుః ।
పాచనో నావనశ్ఛర్ది కఫమేదోనిలాపహా ॥
నహంతి హృద్రుజా ధ్మానా ర్శః కండు శూలో దరా పచీః ॥

ఉత్తరేణు తిక్తరసమును, కటుకారు రసమును, సర, తీక్ష్ణగుణములను గలిగియుండును జాఠరాగ్నిని వృద్ధిబొందించును. ఆమమును పచింపజేయును. నస్యకర్మకు యోగ్యమైనదిగ నుండును. కఫ వాతములను శమింపజేయును. మేదోవృద్ధి, ఛర్ది, హృద్రోగము, ఆధ్మానము, అర్శస్సు, కండు, శూల, ఉదరము, అపచి అను నీ వ్యాధులను పోగొట్టును.

క్షారగుణములుగలది. సంగ్రాహి, మూత్రలము, జ్వరహరము శీతవీర్యము.

రక్తాపామార్గ గుణములు—

శ్లో॥ అపామార్గో ఒరుణో వాత విష్టం భీ కఫకృద్ధిమః ।
రూక్షః పూర్వ గుణైర్న్యూనః కథితో గుణ వేదిభిః ॥

ఎఱ్ఱయుత్తరేణి తెల్లయుత్తరేణికి చెప్పిన గుణములను తక్కువగా గలిగియుండును. మఱియు రూక్ష గుణమును, శీతవీర్యమును గలిగియుండును. వాతమును, మలమును స్తంభింపజేయును.

(3) విశేష గుణములు—

(1) శ్వేతాపామార్గము—ఉష్ణవీర్యమును గలిగియుండును. మలాదులను నిరోధించును. వాంతిని గలిగించును. రక్తదుష్టిని బోగొట్టును. (ధ. ని.) రక్తస్రావమును నిలుపును. నస్యకర్మకును, వమనకర్మకును ప్రశస్తమైనది. నస్యమును చేసిన శిరస్సునందలి క్రిములు నశించును. రక్తాతీసారమును, దద్రుకుష్ఠమును బోగొట్టును. (శో.ని.) అగ్నివలె తీక్ష్ణగుణమును గలిగియుండును. క్లేదనము. స్రంసనము. (రా. వ.)

(2) పత్రము—రక్తపిత్తమును బోగొట్టును. (మ.ని.)

(3) రక్తాపామార్గము—కటురసమును గలిగి యుండును. మలాదులను నిరోధించును. వాంతిని గలిగించును. కఫవాతములను శమింపజేయును. వ్రణ మును, కండువును, విషమును బోగొట్టును. (ధ-ని).

(4) బీజము—మధుర రసమును, రూక్ష గుణమును, మధుర విపాకమును గలిగియుండును. కష్టముగ జీర్ణమగును. విష్టంభమును గలిగించును. వాతమును వృద్ధిబొందించును. రక్తపిత్తమును బోగొట్టును. (భా-ప్ర) వాంతిని గలిగించును. కాసను బోగొట్టును. (ని-ర).

(5) జలజాపామార్గము—కటురసమును గలిగియుండును. కఫవాతములను శమింపజేయును. శోఫను, కాసను, శోషను బోగొట్టును. (వై-ని).

(4) భేదములు—

(1) సమూలకషాయము;—1-16 నీళ్లతో కాచి 4 ఔన్సుల మోతాదు చక్కెరతో షర్బత్తుగా ఇవ్వవచ్చును.

(2) పచ్చి ఆకులు:—$\frac{1}{4}$ తు, మిరియములు 5 గ్రె; వెల్లుల్లి 5 గ్రె ఒక మాత్రచేసి చలిజ్వరములలో ఇవ్వవచ్చును.

(3) ఆకుల కల్కము:— తేనెటీగలు, కందిరీగలు, తేలు మొదలగు విషపురుగుల కాటుమీద రుద్దవలెను.

(4) వేరుచూర్ణము:—5 గ్రె; మిరియాలచూర్ణము 5 గ్రె; తేనెతో కలిపి దగ్గులకు ఇవ్వవచ్చును.

(5) గింజలు:—$\frac{1}{4}$ తులము వఱకు కడుగునీళ్లతో నూరి వడియగట్టి చక్కెరతో రక్తార్శస్సునందు ఇవ్వవలెను. ఈ గింజలు ఆకలి చంపుటకును కామోద్రేకమును దళింపజేయుటకు యోగులు ఉపయోగించెదరని చెప్పుదురు. మంత్రవాదులు వేరును మంత్రించి ఉపయోగించెదరు. (ఆ. ల.)

(5) ప్రయోగములు—

(1) శిరోవిరేచనమునకు—

"ప్రత్యక్పుష్పీ శిరోవిరేచనానాం"

ఉత్తరేణి శిరోవిరేచన కర ద్రవ్యములలో శ్రేష్ఠమైనది. చ-సూ. 25.

(2) అర్శోరోగమునకు—

"అపామార్గమూలం చ తండులోదకేన సక్షౌద్రం మహార్శసాం"

ఉత్తరేణి వేరును కల్కముగా నూరి బియ్యపు కడుగునందు చేర్చి అందు కొద్దిగా తేనెను కలిపి ప్రతిరోజును సేవించుచుండిన అర్శస్సు శమించును.
(సు. చి. అ. 6.)

(3) క్రిములకు—

"తతః శిరీషకిణిహీ ‌రసం క్షౌద్రయుతం పిబేత్"

దిరిశెన చెక్క, ఉత్తరేణి వీనియొక్క రసమునందు తేనెనుజేర్చి సేవించిన క్రిమిరోగము శమించును. (సు. ఉ. అ. 54).

(4) శర్కరకు—

"క్షారః పేయోఽ విమూత్రేణ శర్కరాస్వశ్మరీషు చ"

ఉత్తరేణి క్షారమును గొర్రె మూత్రమునందు కలిపి సేవించిన శర్కరయు, అశ్మరియును శమించును. (వా. చి. అ. 11).

(5) కర్ణనాద బాధిర్యములకు—

"మార్గక్షార జలేన తత్కృత కల్కేన సాధితం తిలజం
అపహరతి కర్ణనాదం బాధిర్యం చాపిపూరణతః"

ఉత్తరేణి క్షార జలమునందు ఈ క్షార కల్కమును, తిల తైలమును జేర్చి పక్వముచేసి దీనితో కర్ణపూరణము చేసిన కర్ణనాదము, బాధిర్యమును శమించును. (బృంద)

(6) తృతీయక జ్వరమునకు:—

"అపామార్గ జటాకట్యాంలోహితైః సప్తతంతుభిః
బధ్వావారే రవేస్తూర్ణం జ్వరం హంతి తృతీయకం"

ఉత్తరేణివేరును ఎర్రని ఏడుదారములతో చుట్టపెట్టి యాదివారమునాడు తృతీయక జ్వరితునికికట్టినయడల శీఘ్రముగ జ్వరము శమించును.(బృంద)

(7) శిరశ్శూలకు:—

"తైలమభ్యంగాత్ । శిరసోరుజః సముగ్రాయదివా
అపామార్గ ఫలసిద్ధం"

ఉత్తరేణి బీజముల కల్కముతో పక్వము చేసిన తైలమును అభ్యంగము చేసిన శిరశ్శూల శమించును. (గ. ని.)

(8) నేత్రపీడకు:—

"అపామార్గ శిఫాఘృష్టా మధునా సైంధవేనచ
తామ్రపాత్రే భృతా నేత్రే హంతి పీడాం తదుద్భవాం"

ఉత్తరేణి వేరును మెత్తగా నూరి దీనిని తామ్రపాత్రయందుంచి అందు సైంధవచూర్ణమును, తేనెను జేర్చి మెత్తగా రుద్ది నేత్రములకు అంజనము వేసిన నేత్రపీడ శమించును. (గ. ని)

(9) సద్యోవ్రణ, (శస్త్రఘాత) ములకు:—

"నిష్పీడితైః కరపుటేన మయూరకస్య పత్రైః
వినిస్సరతియః స్వరసోఽతి సాంద్రః।
తత్పూరితే సతతవేగమపి క్షణేన
రక్తం నిరుద్ధ మవతిష్ఠతి శస్త్రఘాతే"

ఉత్తరేణి యాకులను చేతులతో మెత్తగా నలిపి యందుండి వచ్చిన చిక్కని రసమును శస్త్రక్షతమునందు పూరించిన యెడల వెంటనే రక్తస్రావము నిలుచును. (గ.ని.)

(10) యోనిశూలకు:—

"అపామార్గ పత్రద్వయం యోనిమధ్యేనివిష్టం
క్షణాద్యోనిశూలం నిహంతి। సుదుర్వార
మప్యేవమేవ ప్రయుక్తో విదధ్యాత్॥

ఉత్తరేణి యాకుల రెండింటిని యోనిమధ్య నుంచినచో వెంటనే దుర్వార్యమగు యోని శూలగూడ శమించును. (గ. ని.)

(11) సర్పవిషమునకు:—

"సాజ్యామయూరచూడా తు పీతా తండుల వారిణా
సర్వసర్పవిషం హన్యాత్ కాకజంఘా ధవా ధృవం।

ఉత్తరేణికల్కమును నేతితో గలిపి తండుల జలముతో సేవించిన సర్వసర్పవిషములును శమించును. (గ. ని.)

(12) మూత్రకృచ్ఛ్రమునకు:—

"మూత్రకృచ్ఛ్రం జయేత్పీతా క్షీరేణ శిఖరీ శిఫా।
అజాక్షీరేణ సంపేష్య పీతా నీలీజటా తథా॥

ఉత్తరేణి వేరు కల్కమును పాలతో సేవించిన మూత్రకృచ్ఛ్రము శమించును. (వై. మ.)

(13) సిధ్మకుష్ఠమునకు:—

"పరిలేపా త్సిధ్మ యాత్యస్తమపామార్గస్య భస్మనా
కేవలేన యథాపాపం చంద్రశేఖర భస్మనా"

కాల్చిన యుత్తరేణి బూడిదతో లేపనము చేసిన సిధ్మకుష్ఠము శమించును. (వై. మ.)

(14) విషూచికకు:—

"జలపీత మపామార్గమూలం హన్యాత్ విషూచికాం"

ఉత్తరేణి వేరు కల్కమును జలముతో సేవించిన విషూచిక శమించును. (భా. ప్ర.)

(15) రక్తార్శస్సులకు—

"అపామార్గస్య బీజానాం కల్కస్తండుల వారిణా
పీతో రక్తార్శసాం నాశం కురుతే నాత్ర సంశయః"

ఉత్తరేణి గింజల కల్కమును తండులజలముతో సేవించిన రక్తార్శస్సు శీఘ్రముగా శమించును. (శా. సం)

(16) శోఫకు—

"సంస్వేదన క్రియా కార్యా మయూరైః కోకిలాక్షైశ్చ"

ఉత్తరేణి కషాయముతో స్వేదకర్మ చేసిన శోఫ శమించును. (హా. సం)

(6) యోగములు—

(1) అపామార్గక్షార తైలము:— కర్ణపూరణము చేసిన కర్ణనాదము; బాధిర్యము శమించును. (భైషజ్య. కర్ణరోగ)

(2) శిఖరీఘృతము—సర్వవిషములు, సన్నిపాతజ్వరము, విషమజ్వరము ఇవి శమించును. మోతాదు 1 తులము (భైషజ్య. విష)

(3) అపామార్గ తైలము— నశ్యము చేసిన శిరస్సునందలి క్రిములు నశించును. (గ. ని; శిరోరోగ)

(7) Actions and uses:—Astringent, diuretic and alterative, given in menorrhagia, diarrhoea and dysentery. Khar is largely used in anasarca, ascites and dropsy. It is also given in cutaneous affections and enlargements of glands; and to loosen expectoration in cough. It has a great reputation in dog bites and bites of snakes and other venomous reptiles for

which purpose it is given internally. and also applied externally. The juice is sometimes applied in tooth ache and the paste as eye-salve (anjan) in opacity of the cornea. A medicated oil is dropped into the ear in deafness and noises in the ears.

(R. N. Khory II p. 50 4-5).

## స్వానుభవము

[చలి జ్వరమునందు నవనవలాడు ఉత్తరేణి యాకులు గచ్చకాయంతమాత్ర బెల్లముతో చేర్చిగాని, సమభాగము మిరియాలు, వెల్లుల్లి చేర్చి మాత్రలు కట్టి శెనగ గింజంత మాత్రలు ఒకో. కృ. మోతాదుకు 1 లేక 2 మాత్రలు చొప్పున దినమునకు మూడుసార్లు ఇచ్చుట యుక్తము.

నాడ్కర్ణి. పే. 19.

ఉత్తరేణి గింజలు తింటే ఆకలి యుండదని చెప్పుదురు. దీనిని గూర్చి పరిశోధించవలెను. ఉత్తరేణి వేరు దంతధావనమునకు మంచిది. సాధువులు ఇట్లు జేయుదురట. ఆ. ల.]

# 16

# ఆకారకరభః - అక్కలకర్ర

## భాషాంతర నామములు

హిందీ—అకరకరా, మరాఠీ—, అక్కలకారా, గుజరాతీ—అక్కలక (గ) రో, మలయాళం—అక్లాకార2, కర్ణాటకం—అక్కళాకారం, ద్రావిడం—ఆకారకగం.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Compositae

### చామంతి కుటుంబము

### అక్కలకర్ర—Ipomoea reniformis

ఇది లషింగ్టన్ 53 వ నెంబరున వర్ణించబడియున్నది.

ఈ కుటుంబమునందు కుటుంబ, నల్లతపత, ఎంటిరింత, చందుగల్లహార, మణటతీగ, చామంతి, పొద్దుతిరుగుడు, బంతి, బెంకీసు, కొండనువ్వులు మొదలగునవి చేరియున్నవి.

ఆకులు:—అడుగున కొన్నియాకులు మాత్రమే అభిముఖచేరిక. పైకిపోను ఒంటరి చేరిక. కొంచెమించుమించు హృదయాకారముగ నుండును. కొనసన్నము, రెండువైపులను మెత్తని రోమములు గలవు. సమాంచలము. విషమరేఖపత్రము.

పుష్పమంజరి—:బంతి మనము చూచి పుష్పమని భ్రమించునది యొక పుష్పము గాదు. అనేక పుష్పముల సముదాయము. పుష్పసముదాయమున కడుగున నాకు పచ్చగనుండు రేకులు చేటికలుగాని రక్షకపత్రములుగావు. లోపలనున్న రేకొక్కక పుష్పము. మధ్యాకర్షీసరణము. కొన్ని నపుంసకపుష్పములు, కొన్ని యేకలింగపుష్పములుగా నుండును.

పుష్పకోశము—రక్షకపత్రములు రేకులవలెనుండక రోమములవలె మారియున్నవి. ఉచ్చము,

దళవలయము:—సంయుక్తము. చుట్టునున్న పుష్పములయొక్క దళవలయము నాలుకవలె వెడల్పుగ నుండును. మధ్యపుష్పముల దళవలయము సన్నని గొట్టమువలె నుండును.

కింజల్కములు:—అయిదు. కాడలు దళవలయమున కంటియున్నవి. పుప్పొడి తిత్తులు రెండుగదులు. అన్ని పుప్పొడితిత్తులును కలుసుకొని యుండును.

అండకోశము:—అండాశయము నీచము, ఒకగది. ఒకటే అండము. కీలము మొదట కింజల్కములకన్న పొట్టిగనుండి, క్రమముగా వానికంటె పెద్దదై పుప్పొడి తిత్తులమధ్య నుండి చీల్చుకొని పైకిపోయి రెండు కీలాగ్రములుగ చీలును.

ఇదియొక పెద్దకుటుంబము. ప్రపంచములో నన్నిభాగముల యందును దీనిని కనుగొననగును. ఈ కుటుంబములోని మొక్కలన్నియు గుల్మములు. ఆకులు చాల భాగమువరకు ఒంటరిచేరిక, వృంతాగ్రముపై సాధారణముగా పొలుసులుండవు. పుష్పకోశము కొన్ని పుష్పములలో పొలుసులవలెను కొన్నిటిలో రోమములవలె నుండును.

## పర్యాయ పదములు

శ్లో॥ ఆకారకరభశ్చ్వా కల్లకోఽథహ్యా కల్లకః॥

ఆకారకరభము, ఆకల్లకము, అకల్లకము అనునవి యాకారకరభ నామములు.

## గుణములు

శ్లో॥ అకల్లకోష్ణో వీర్యేణ బలకృత్కటుకో మతః।
ప్రతిశ్యాయంచ శోథంచ వాతం చైవ వినాశయేత్।

అక్కలకర్ర కటురసమును, ఉష్ణవీర్యమును గలిగి యుండును. బలమును గలిగించును. వాతమును శమింపజేయును. ప్రతిశ్యాయమును, శోథను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామము:—

గుణబోధకములు - ఆకరకర

(2) శబ్దార్థములు:—

ఆకరకర - వ్రణమును గలిగించునది.

[N. B:—దీని యుత్పత్తిని గురించిగాని, స్వరూపాదులను గురించిగాని తెలియజేయు నంశము లెందును గానరాకున్నవి. ఆకారకరభం ఉత్తర ఆఫ్రికాయందును మధ్యధరా సముద్రమునకు తూర్పునయుండు దేశములందు పెరుగునట్టిదియు, వ్యవసాయము చేసి పెంచునట్టియు ఒక చెట్టుయొక్క వేరు బజారులో 2,3 అంగుళములు ముక్కలుగా కోసి అమ్ముదురు.

అయితే మనకు బజారులందు దొరకునది మూలరూపమున నుండు నట్లు దెలియగలను. ఇది యొక విధమగు గంధమును గలిగి యుండును. తృష్ణారోగమునందు దీనిని నోటియం దుంచుకుని కొద్ది కొద్దిగ రసమును మ్రింగుచుండిన తృష్ణ శమించును. అయితే నోటియం దుంచుకొనినప్పుడు నోటియందొక విధమగు చిమ చిమ యను మంట బుట్టును. అధికముగా నుంచినచో నొకింత వ్రణము గూడ గలుగుటయు కలదు. ఆ. ల.]

(3) ప్రయోగములు:—

1. ఫిరంగరోగమున ఆకారకరభ ప్రయోగము.

"పారదష్టంక మానః స్యాత్ ఖదిరష్టాంక సమ్మితః।

ఆకారకరభశ్చాపి గావ్యాష్టంక ద్వయోన్మితః ॥
టంకత్రియోన్మితం క్షౌద్రం ఖల్వేసర్వం వినిక్షిపేత్ ।
సమ్మర్ద్యతస్య సర్వస్య కుర్యాత్సప్త వటీర్భిషక్ ॥
సరోగీ భక్షయేత్ప్రాతః ఏకైకా మంబునావటీం ।
వర్జయేదమ్ల లవణం ఫిరంగ స్తస్య నశ్యతి ॥"

శుద్ధిజేసిన పాదరసము 1 టంకము (4 మాషములయెత్తు), చంద్రసారము 1 టంకము, అక్కలకర్ర 2 టంకములు, ఇటుల గ్రహించి యిందు కడపటి రెండింటిని మెత్తగా చూర్ణించి మిగిలిన దానిని గూడ జేర్చి ఖల్వమునం దుంచి అందు తేనెను 3 టంకముల ప్రమాణము కలిపి మెత్తగా నూరి 7 మాత్రలను జేయవలెను. వీనిని ప్రతిదినము ఉదయకాలమున ఒక్కొక్కటి చొప్పున మంచినీళ్ల అనుపానముతో సేవింపుచు అమ్లలవణ వర్జితముగు ఆహార మును దీసుకొనుచుండిన ఫిరంగరోగము శమించును. భా. ప్ర. (ఇక్కడ అక్కలకర్ర ప్రధాన ద్రవ్యము కాదనియు పాదరసము ప్రధాన మనియు తోచుచున్నది.) (ఆ. ల.)

(4) యోగములు:—

1. ఆకారకరభాది చూర్ణము:—శార్ఙ్గ-మ-అ 6. మాత్ర:- $\frac{1}{4}$ తులం.

ఉపయోగములు:—శుక్రస్తంభనమును, వాజీకరణమును అగును. (ఇక్కడ నల్లమందు, జాజికాయ ప్రధాన ద్రవ్యములు) (ఆ. ల)

(5) Physiological actions:-Stimulent, rubefacient, irritant and sialogogue locally rubefacient. In small doses it is stimulent and cordial. As a masticatory sialogogue it produces pricking sensation in the tongue with heat, pungency and copious flow of saliva, constriction in the fauces and increased buccal mucous In large doses it is an irritant to the mucous membrane of the intestines causing bloody stools tetanoid spasms and profound stupor. The pulse becomes accelerated.

Therapeutics:—The infusion is given with lesser galangal and ginger in low states of the system with drousiness and lethargy. The tincture is given in neuralgia, headache, tooth ache due to caries in paralysis of the tongue and in neuralgia of the face. As a local anesthetic gargle or lotion

or a mouth wash it is used in sore throat, relaxed vula aphonia etc, As a sternutatory the powder is inhaled in chronic catarrh of the frontal sinuses. The confection is given in impotence and in chronic seminal weakness. As a sialogogue it is an efficient remedy in chronic iodine poisioning where it secures a prompt and rapid elimination.

"Materia Medica of India" by R. N. Khory, II, P. 349..

## స్వానుభవము.

「అక్కలకఱ్ఱ తృష్ణయందు నోటిలో, నీరూరుటకును, పంటినొప్పికిని, ముఖ్యముగా ఉపయోగము. వీర్యవృద్ధి కరములగు ఔషధములలో హెచ్చుగ చేరుచున్నది. నేను ప్రత్యేకముగ ఉపయోగించి చూడలేను గాని, మనకింకను తెలియని సుగుణము ఏదైన నుండవచ్చునని నా అభిప్రాయము. జ్వరములందును, వాత వ్యాధులయందును ఉపయోగింపవచ్చును. శొంఠిగంధము వలె నొప్పులుగల చోట వ్రాసి శోధ తగ్గుటకును ఉపయోగింపవచ్చును.

అక్కలకఱ్ఱ క్రిమిహరద్రవ్యములలో నొకటిగా ప్రసిద్ధి జెందియున్నది. దీనిని ప్రస్తుతము జరుగు మహాయుద్ధములో దోమలను నశింపజేయుటకు మహౌషధిగా నుపయోగించుచున్నారు. గాలి తగలగానే ఎగిరిపోవు ఒక ద్రావకములో అక్కలకఱ్ఱను కరిగించి గాజుగుల్లలలో నింపుదురు. ఆ గుల్ల పగలగొట్టగానే ఆవాసన చుట్టుప్రక్కల వ్యాపించి యటనుండు దోమలను నశింపజేయును. అ. ల.]

# 17

# ఆఖుకర్ణీ - ఎలుకచెవియాకు

## భాషాంతర నామములు

హిందీ—చుహాకన్నీ, మూషాకానీ, మూషాకానీ, మరాఠీ—ఉందిర కానీ, భోపనీ, గుజరాతీ—పాథరడీ, ఉందరకానీ, మలయాళం—ఎలిచ్చెవీ, కర్ణాటకం—వల్లిహరుగె, ద్రావిడం—ఎలిచ్చెవి, ఎలియాలు.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Convolvulaceae

చిలకడదుంప కుటుంబము

ఎలుకచెవియాకు—**Ipomoea reniforins.**

మిగిలిన వివరములకు తెగడచూడుడు.

## పర్యాయ పదములు

శ్లో॥ ఆఖుకర్ణ్యాఖుకర్ణ పర్ణికా భూదరీభవా ॥

ఆఖుకర్ణి, ఆఖుకర్ణపర్ణిక, భూదరీభవ యనునవి యాఖుకర్ణీ నామములు.

## ఆ ఖు క ర్ణీ గు ణ ము లు

శ్లో॥ ఆఖుకర్ణీ కటుస్తిక్తా కషాయా శీతలాలఘుః।
విపాకే కటుకామూత్రకఫామయ కృమిప్రణుత్ ॥

ఎలుకచెవియాకు కటురసమును, తిక్తకషాయాను రసములను, లఘు గుణమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. మూత్రజ రోగములను, కఫజరోగములను, క్రిములను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—ఆఖుకర్ణపర్ణిక, (బహుపాదిక, ప్రతిపర్ణశిఫ, పత్రశ్రేణి).

(ఖ) ఉత్పత్తి బోధకములు:—భూదరీభవ.

(2) శబ్దార్థములు:—

ఆఖుకర్ణపర్ణిక - ఎలుకచెవివంటి పత్రములతో గూడి యుండునది. బహుపాదిక - విశేషముగ మూలములతో గూడి యుండునది. ప్రతిపర్ణశిఫ - ఒక్కొక్క యాకుక్రింద వ్రేళ్ళను గలిగి యుండునది. పత్రశ్రేణి - పంక్తివలె దీర్చియుండు పత్రములను గలది. భూదరీభవ - కొండచరియలయందుత్పన్నమగునది.

(3) భేదములు:—

ఇది పెద్ద చిన్న భేదముచే రెండు విధములుగా నుండి లతాజాతులలో నుత్పత్తి గలిగి క్రిమిహర ద్రవ్యములలో గణింపబడు చున్నది. మఱియు గొన్ని నిఘంటువులందు స్థలజ - జలజ భేదముచే రెండు విధములుగా వర్ణింపబడినట్లు దెలియగలదు. దీనిని బట్టి పైని వచింపబడినట్టి భేదములలో నేదియో యొకటి స్థలజముగ (లేక) జలజముగ నుండునో అటుగాక స్థలజ జలజములలో తిరిగి పెద్ద చిన్న భేదములు ప్రత్యేకముగ నుండునో స్పష్టముగ జెప్పుటకు గావలసిన విషయము లెందును గానరాకున్నవి. ఇదియును గాక భావమిశ్రుడు దీని నొకే రూపమున గ్రహించుటకు గల కారణమును దెలియకున్నది.

ఇది లతారూపమున నుత్పత్తియై యెలుకచెవివంటి పత్రములను గలిగి ప్రతి యాకు మొదటను వ్రేళ్ళతో గూడి కొండచరియలందు విస్తరిల్లునట్లుగా పై పదములను బట్టి దెలియగలదు. ఇంతకన్న దీనిని గురించిన విపులాంశము లెచ్చటను గానరావు. ఇది విశేషముగా క్రిమిరోగమున నుపయోగింపబడుచున్నట్లు దెలియగలదు. మరియు దీని యందలి పెద్దజాతి నిఘంటు

రత్నాకరమును బట్టి రసాయనమునకును, పారదమునకు చేయబడు బంధన సంస్కారమునకును ప్రయోగింపబడు చున్నట్లు తెలియగలదు.

(4) విశేష గుణములు:—

(క) సామాన్య-తీక్ష్ణ సర గుణములను గలిగి యుండును. యోనిరోగము లను బోగొట్టును. శో-ని.

(ఖ) క్షుద్రాఖుకర్ణి - కటురసమును, తిక్తకషాయాను రసములను, లఘుగుణమును, సమశీతోష్ణ వీర్యములను, గలిగి యుండును. రసాయనము. కఫపిత్తములను శమింపజేయును. శూల, జ్వరము, క్రిమి, గ్రంధి, మూత్ర కృచ్ఛ్రము, ప్రమేహము, ఆనాహము, ఉదరము, హృద్రోగము, విషము, పాండువు, భగందరము, కుష్ఠము వీనిని బోగొట్టును. ని-ర.

(గ) బృహదాఖుకర్ణి-మధురరసమును, శీతవీర్యమును గలిగి యుండును. రసాయనము, నేత్రములకు హితమైనది. పాదరసమునకు బంధన సంస్కారము జేయును- శూలను, జ్వరమును, క్రిములను, వ్రణమును, ఆఖువిషమును బోగొట్టును. ని-ర.

(5) ప్రయోగములు:—

1. క్రిమిరోగమునం దాఖుకర్ణీ ప్రయోగము.

మూషికపర్ణీం సమూలాగ్రప్రతానా ముపహృత్య ఖండశః।
ఛేదయిత్వా ఉదూఖలే క్షోదయిత్వా పాణిభ్యాం పీడయిత్వా
చ రసం గృహ్ణీయాత్ తేన రసేన లోహితశాలితండులపిష్టం।
సమాలోడ్య పూపలికాం కృత్వా విధూమేష్వంగారేషు
విపాచ్య విడంగతైల లవణో పహితాం
క్రిమికోష్ఠాయ భక్షయితుం ప్రయచ్ఛేత్ ॥"

ఆఖుకర్ణీలతను సమూలముగ గ్రహించి చిన్న చిన్న ముక్కలుగా గోసి మెత్తగా దంచి చేతులతో పిండి రసమును గ్రహించి దీనితో యెఱ్ఱ బియ్యపుపిండినిగలిపి యప్పముచేసి వాయువిడంగముల తైలమును, సైంధవ లవణమును పై దానికి బూసి పొగలేని నిప్పులపై గాల్చి క్రిమికోష్ఠముగల వాని కిచ్చిన క్రిమిరోగముశమించును. చ-వి-అ. 7.

2. గర్భధారణముకై ఆఖుకర్ణీ ప్రయోగము.

"గర్భాభావకృతాన్ దోషాన్ ఏకాఏవ హి నాశయేత్ ।
యోనిమధ్య స్థితాస్త్రీణాం మూషికర్ణీ శిఫాధ్రువం ॥"

గర్భధారణము లేకుండునట్టి స్త్రీలయొక్క యోనిమధ్యయందు ఆఖుకర్ణీ మూలమును ధరింపజేసిన యెడల గర్భాశయగత దోషము శమించి గర్భధారణ యోగ్యత గలుగును. గ-వి.

(6) యోగములు:—

1. ఆఖుకర్ణ్యాది చూర్ణము - వై-చిం-క్రిమి. మాత్ర:-$\frac{1}{4}$ తులం.
ఉపయోగములు:—క్రిమిరోగము శమించును.

(7) A decoction of the plant (1 in 20) is said to act as deobstruent, diuretic and alterative, useful in rheumatism, neuralgia. headache etc; dose is from 1/2 to 1 ounce. The leaf-juice is also given, for migraine, as purgative. The leaf-juice is also given in rat-bites and snake-bites in doses of 1 to 2 tolas. It is also locally applied to the parts bitten. It is also used for dropping into the ear in cases of ulcers, abscesses etc. In epilepsy its powder mixed with java flour and water is applied to swellings.

# 18

# ఆటరూషకః - అడ్డసరపుచెట్టు

## భాషాంతర నామములు

హిందీ—బాసా, బిసోంటా, అడూసా, మరాఠి—అడూళసా, అడుళసా, గుజరాతి—అరడుశీ, మలయాళం—ఆడలోడకం, కర్ణాటకం—ఆడుసోగె, ద్రావిడం—ఆడాతోడై.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Acanthaceae

అడ్డసరపు కుటుంబము

### అడ్డసరము—Adhatoda Vasika

ఈ కుటుంబమునందు అడ్డసరపుచెట్టు, నేలవావిలి మొదలగునవి చేరియున్నవి.

ఆకులు:—అభిముఖచేరిక. లఘుపత్రము. కణుపు పుచ్ఛములులేవు. కురుచతొడిమ. వెడల్పుగ బల్లెపాకారముగ నుండును. సమాంచలము. విషమరేఖపత్రము. ఇరుప్రక్కల నున్నగా నుండును. కొన పన్నము.

పుష్పమంజరి:—కంకి కణువుసందులనుండి పెరుగు వృంతముల మీద పుష్పములు దట్టముగానుండును. ఉపవృంతములులేవు. చేటికలుగలవు. 2 చేటికలు 2 ఉపచేటికలును కలిసి పుష్పమును మఱుగుపరచును.

పుష్పకోశము:—సంయుక్తము. తమ్మెలు 5. నీచము. ఆకు పచ్చని రంగు.

దళవలయము:—సంయుక్తము. క్రిందిభాగము గొట్టమువలెను పైభాగము ఓష్ఠాకారముగను నుండును. పై పెదవియందు తమ్మెలు రెండును. క్రింది పెదవియందు మూడును కలవు. తెలుపురంగు. క్రింది పెదవిమీద నెఱ్ఱని చారలు గలవు. మొగ్గలో నీ తమ్మెలు అల్లుకొని యుండును.

కింజల్కములు:—రెండు. దళవలయము నంటుకొనియుండును. పై పెదవికి దగ్గరగానుండును. పుప్పొడి తిత్తులు క్రిందివైపున కోణమువలె నుండును. పుప్పొడి తిత్తుల రెండుగదులను సమముగా నుండక ఒకటి మీదికిని రెండవది కొంచెము క్రిందకునునున్నవి.

అండకోశము:—అండాశయము ఉచ్చము. రెండుగదులు. నాలుగు అండములు. కీలము:—అండాశయశిఖరమునుండి పుట్టును. గుండ్రము. కీలాగ్రము:—గుండ్రము.

రెండుగాజీలియుండుటయుగలదు. ఫలము:— రెండుగదులు. గట్టిగానుండు కాడలనంటి నాలుగు గింజలుండును, బహువిదారుణఫలము.

అడ్డసరముచెట్టు హిందూదేశమునందెల్లయెడలను బెరుగుచున్నది. దీనిని తఱచుగా దోటలయందును దొడ్లలోను బెంచుచుందురు. ఇది గుబురుచెట్టు. సాధారణముగా 4—8 అడుగులవఱకు బెరుగును. గాని అప్పుడప్పుడు 20 అడుగుల వఱకుగూడ బెరుగును. బెరడు నున్నగాను బూడిదవర్ణముగాను నుండును.

ఈ కుటుంబపు మొక్కలు ఉష్ణదేశములందు విరివిగా పెరుగుచున్నవి. వీనిలో గుబురు మొక్కలు, గుల్మములేగాని పెద్దవృక్షములులేవు. ఆకులు అభిముఖచేరిక, లఘుపత్రములు, సమాంచలము. సాధారణముగా చేటికలుండును. దళవలయము సంయుక్తము. ఓష్ఠాకార ముగ నయినను, ఆసరాళముగానైననుండును. కింజల్కములు రెండో, నాల్గోయుండును. కాని, యెందును అయిదుండవు. అండకోశము ఉచ్చము. రెండుగదులు. కాయ బహువిదా రుణఫలము, కాయలెండి రెండుమూడుచోట్ల పగులును. అదివఱకు గలసియున్న డిప్పలు అకాత్తుగా విచ్చుటచే లోపలిగింజ లెగిరి కొంచెము దూరముగా పడును. అట్లుగాక గింజ లన్నియు దల్లిచెట్టునకు దగ్గరగా బడి మొలచినయడల సచ్చోట దొరకు నాహారము చాలక చచ్చిపోవలసి వచ్చును. అట్టిహాని నివారించుటకై గింజలు దూరదూరముగా బడునట్లు గాయలయందీ యేర్పాటు గలిగినది. ఈ కుటుంబములోనికల్ల మిక్కిలి యుపయోగమైనది అడ్డసరము చెట్టు. దీనియాకులను పనసచెక్కయొక్క రంపపు పొట్టుతోగలిపి కాచి యొకవిధ మగు పచ్చని రంగు చేసెదరు. అడ్డసరపు ఆకులతో దమ్ముచేసినయడల వరిచేలు మిక్కిలి సారవంతములగును. దీని బొగ్గును దఱచుగా దుపాకిమందునకు నుపయోగింతురు. దీని చెక్కతో గొన్ని రుద్రాక్షలుగూడ చేయుచున్నారు.

## పర్యాయపదములు

శ్లో॥ వాసకో వాసికా వాసా భిషఙ్మాతా చ సింహికా।
సింహాస్యో వాజిదంతః స్యాదాటరూషక ఇత్యపి।
అటరూషో వృషనామా సింహపర్ణశ్చ సః స్మృతః॥

వాసకము, వాసిక, వాస, భిషఙ్మాత, సింహిక, సింహాస్యము, వాజి దంతము, ఆటరూషకము, అటరూషము, వృషనామ, సింహపర్ణము అనునవి యాటరూషక నామములు.

## గుణములు

శ్లో॥ వాసకో వాప కృత్స్వర్యః కఫపిత్తాస్రనాశనః।
తిక్తస్తువరకో హృద్యః లఘుః శీతస్తృడర్తిహృత్।
శ్వాసకాస జ్వరచ్ఛర్ది మేహకుష్ఠ క్షయాపహః॥

అడ్డసరపుచెట్టు తిక్తరసమును, కషాయానురసమును, లఘుగుణమును, శీతవీర్యమును గలిగి యుండును. స్వరమును గలిగించును. హృదయమునకు హితమైనది. వాతమును వృద్ధిపొందించును. కఫమును శమింపజేయును. రక్తపిత్తము, తృష్ణ, శ్వాస, కాస, జ్వరము, ఛర్ది, ప్రమేహము, కుష్ఠము, క్షయము అను నీ వ్యాధులను బోగొట్టును.

## విశేషాంశములు

(1) ప్రసిద్ధనామములు:—

(క) పరిచయబోధకములు:—భిషఙ్మాత-సింహాస్యము-వాజిదంతము-సింహపర్ణము.

(ఖ) గుణబోధకములు:—(కసనోత్పాటన.)

(2) శబ్దార్థములు:—

భిషఙ్మాత - తల్లివలె వైద్యులకు సర్వవ్యాధులందును మేలు చేయునది. సింహాస్యము - సింహముఖమువలె గుంభకముగ వికసించినట్టి పుష్పములు గలది. వాజిదంతము - గుర్రపుదంతములవలె నుండు పూమొగ్గలు గలది. సింహపర్ణము - సింహముయొక్క నాలుకను బోలు పత్రములను గలది. కసనోత్పాటన - కాసరోగమును బోగొట్టునది.

N. B:—ఇది పొదగా పెరుగు వృక్షజాతులలో నుత్పత్తి గలిగి తిక్తరస ద్రవ్యములలో జేరి కఫ, పిత్త, రక్తపిత్త. శ్వాసకాసాది హారద్రవ్యములలో గణింపబడు చున్నది. ఇది యితర వృక్షములవలె నెత్తుగ బెరుగునది యైనను గట్టితనము లేక తేలికగ విరుచుట కనువగునట్టి కొమ్మలు మొదలగు అంగములతో గూడి యుండును. ఈ వృక్షములు సాధారణముగ నడవులందుత్పత్తి యగును. అయినను దక్షిణభారతమున ప్రతిచోట నుత్పత్తి యగుట చూచుటకు మిగుల నందముగ నుండును. ఇవి చరకాదులచే విశేషముగా రక్తపిత్త శ్వాసకాసాది వ్యాధులందుపయోగింప బడినది. మరియు,

"వాసాయాం విద్యమానాయాం ఆశాయాం జీవితస్య చ ।
రక్తపిత్తీ క్షయీ కాసీ కిమర్థ మవసీదతి" ॥ (వై-జీ.)

దీనిని బట్టి రక్తపిత్తమునందును, మునందును, కాసమునందును
ముఖ్యముగ, బ్రయోజనకారిగ నుండునని యుచున్నది. ఇంతియేగాక
నీ వృక్షముయొక్క సర్వాంగములును జ సర్వవ్యాధులందును నుపయో

గింపబడుచున్నట్లు తెలియగలదు. వ్యవహారమునందు దీని కెట్టి ప్రయోగ ముండెననెడియు దెలియకున్నది. ఇది వంగాది లోహములయొక్క భస్మీకరణముకై గూడ నుపయోగింప బడుచున్నది.

(3) విశేషగుణములు:—

(క) కటుకాను రసమును గలిగి యుండును. కాములను బోగొట్టును. (రా-ని.)

(ఖ) పుష్పము- తిక్తరసమును, శీతవీర్యమును, కటువిపాకమును గలిగి యుండును. కఫపిత్తములను శమింపజేయును. చ-సూ-అ. 27 క్షయమును, కాసమును బోగొట్టును. (సు-సూ-అ. 46)

(గ) శ్వేతాగ్రిగ్రము- తిక్తరసమును గలిగి యుండును. పిత్తకఫములను శమింపజేయును. (సు-సూ-అ.46)

(4) ప్రయోగములు:—

1. రక్తపిత్తమునం దాటరూషక ప్రయోగము.

"వాసాం సశాఖాం సపలాశమూలాం కృత్వా
కషాయం కుసుమానిచాస్య । ప్రదాయకల్కం
విపచేత్ ఘృతంతత్ సక్షౌద్రమాశ్వేవ నిహంతి రక్తం"

అడసరమును సమూలముగ గ్రహించి కషాయముగాచి యందు ఘృతమును, అడ్డసరపుష్పముల కల్కమును జేర్చి పానముజేసె తేనె గలిపి సేవించిన రక్తపిత్తము వెంటనే శమించును. (చ-చి-అ. 4.)

2. శ్వాసకాసాదులం దాటరూషక ప్రయోగము.

"ఆటరూషక మృద్వీకా పథ్యాక్వాథః సశర్కరః ।
మధుమిశ్రః శ్వాసకాస రక్తపిత్త నిబర్హణః ॥"

అడ్డసరము, ద్రాక్ష, కరక్కాయ వీని కషాయమునందు చక్కెరజేర్చి పానముజేసిన కాస, శ్వాస, రక్తపిత్తమును శమించును. (చ-చి-అ. 4).

3. క్రిమికుష్ఠము నందాటరూషక ప్రయోగము.

"వృష కటుః సప్తపర్ణః......స్నానేపానే
లేపే క్రిమికుష్ఠనుదః సగోమూత్రాః"

అడ్డసరపు కషాయమునందు గోమూత్రమును గలిపి స్నానమునకును, పానమునకును, లేపనమునకును ఉపయోగించిన కృమికుష్ఠము శమించును.

(చ-చి-అ 7)

4. రాజయక్ష్మయందాటరూషక ప్రయోగము.

"హస్తపాదాంగ దాహేషు జ్వరే రక్తే తథోర్ధ్వగే।
వాసాసర్పిః శతావర్యా సిద్ధం వా పరమం హితం॥"

అడ్డసరముతో సిద్ధముజేసిన ఘృతమును సేవించిన హస్తపాదాంగ దాహముతో గూడిన రాజయక్ష్మయు, జ్వరమును, ఊర్ధ్వగత రక్తపిత్తమును శమించును.

(చ-చి-అ 5.)

5. రసాయనమున కాటరూషక ప్రయోగము.

"వాసామూల తులాక్వాథే తైల మానాప్య సాధితం।
హుత్వా సహస్ర మశ్నీయాత్ మేధ్య మాయుష్య ముచ్యతే॥"

అడ్డసరపువేరును నూరుపలములు గ్రహించి కషాయముగాచి తైలమును జేర్చి పాకముజేయవలెను. ఇటుల వేయిమార్లు పైవిధముగ కషాయమును జేర్చుచు బాకముజేసి యథావతుగ సేవించిన మేధావృద్ధియు, ఆయుర్వృద్ధియును గలుగును.

(సు-చి-అ 28.)

6. ముఖరోగము.

"స్వరసః క్వథితో వాసాయాః ఘనీభూతః సగైరికః।
అస్యస్థః సమధుర్వక్త్రపాక నాడీ వ్రణాపహః॥"

అడ్డసరపు స్వరసము ఘనీభవించువరకు పాకముజేసి యందు గైరికమును, తేనెను గలిపి నోటియందుంచుకొనిన ముఖపాకము, నాడీవ్రణమును శమించును.

(వా-ఉ-అ 22.)

7. పిత్తశ్లేష్మ జ్వరమునందు ఆటరూషక ప్రయోగము.

"సపత్రపుష్పవాసాయాః రసః క్షౌద్రసితాయుతః।
పిత్తశ్లేష్మజ్వరం హంతి సామ్లపిత్తం సకామలం॥"

అడ్డసరమును పత్రపుష్పములతో గ్రహించి స్వరసమును దీసి అందు తేనె, చక్కెరను జేర్చి సేవించిన పిత్తశ్లేష్మజ్వరమును, అమ్లపిత్తమును, కామిలయు శమించును.

(భా-ప్ర.)

8. కచ్ఛ్వపునం దాటరూషకప్రయోగము.

"శ్రీమలసింహాస్యదలం సనిశం సురభిజలేన పిష్టం
దివసత్రయేణ నియతం క్షపయతికచ్ఛుం విలేపనతః ॥"

లేత యడ్డసరపాకులను, పసపును గలిపి గోమూత్రము (నేరేడుచెక్క రసము)తో నూరి లేపనము జేసిన కచ్ఛువు మూడు దినములలో శమించును.

(చ-ద.)

9. మూత్రాఘాతమునం దాటరూషకప్రయోగము.

"రసందురాల భాయావాకషాయం వాసకస్య వా ॥"

అడ్డసరపు కషాయమును సేవించిన మూత్రాఘాతము శమించును.

(గ-ని.)

10. వాతాసృగ్గదమునందాట రూషకప్రయోగము.

"శర్కరామధుసంయుతం వాసకస్వరసం వాపి॥"

అడ్డసరపు రసమునందు చక్కెరను, తేనెను జేర్చి సేవించిన వాతజాసృగ్గదము శమించును. (గ-ని.)

11, శరీర దుర్వాసనకు:—

"వాసాదలరసో లేపాచ్ఛంఖ చూర్ణేన సంయుతః ।
గాత్రదౌర్గంధ్యంనాశనః"

అడ్డసరపు ఆకు వెచ్చచేసి రసముపిండి శంఖచూర్ణము కలిపి పూయవలెను. (భా-ప్ర.)

12. సుఖప్రసవమునకు—

వేరును గర్భిణీస్త్రీ మొలనుకట్టినను, వేరుగంధము నాభికి పొత్తికడుపునకు పూసి యోనిలోపల లేపనముచేసినను సుఖప్రసవమగును. స్త్రీరోగచికిత్స.

(చక్రదత్త.)

13. మసూచికము:—

స్వరసమును తేనెతో నిచ్చిన శమించును. (వ. వృ.)

14. కంటిపొరలు మసకలు:—

పువ్వులనుండి కారుతేనెతో మానుపసుపు వేరు అరుగదీసి కంటికి కాటుకగాబెట్టిన నేత్రరోగములకు హితము. (వం.సే.)

(5) యోగములు:—

1. వృషఘృతము:—వా - రక్తపిత్త. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—రక్తపిత్తము, పిత్తజగుల్మము, జ్వరము, శ్వాస, కాస, హృద్రోగము, కామిల, తిమిరము, భ్రమ, విసర్పము, స్వరభంగము ఇవి శమించును.

2. వాసా కూష్మాండఖండము - భైషజ్య - రక్తపిత్త. మాత్ర:- 1 తులం.

ఉపయోగములు:—కాసము, శ్వాస, క్షయము, హిక్క, రక్తపిత్తము, హలీమకము, హృద్రోగము, అమ్లపిత్తము, పీనసము ఇవి శమించును.

3. వాసాఖండము - భైషజ్య - రక్తపిత్త. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—క్షతక్షయము, కాసము, శ్వాస, యక్ష్మ, రక్తపిత్తము ఇవి శమించును.

4. బృహద్వాసావలేహము - భైషజ్య - యక్ష్మ. మాత్ర:-1 తులం.

ఉపయోగములు:—యక్ష్మ, ఆనాహము, కాస, స్వరభంగము, అగ్నిమాంద్యము, హృద్రోగము, క్షతక్షయ, మూత్రకృచ్ఛ్రము, రక్తపిత్తము, శ్వాస, జ్వరము, ప్లీహవృద్ధి, అమ్లపిత్తము, ఛర్ది ఇవి శమించును.

5. సింహాస్యాదివటి - భైషజ్య - కాస. మాత్ర:-2 గుంజలు.

ఉపయోగములు:—ఉరఃక్షతము, శ్వాస, రక్తపిత్తము గల రోగము, రక్తాతిసారము, యక్ష్మ, రక్తప్రదరము, కాస, శోఫ, గ్రహణి ఇవి శమించును.

6. వాసాచందనాది తైలము - భైషజ్య - కాస.

ఉపయోగములు:—పానాభ్యంగాది రూపముగ నుపయోగించిన కాస, జ్వరము, రక్తపిత్తము, పాండు, హలీమకము, కామిల, క్షతక్షయము, రాజయక్ష్మ, శ్వాస యివి శమించును. బలము, వర్ణము, అగ్ని బలమును గలుగును.

7. వాసారిష్టము - భైషజ్య - కాస. మాత్ర:-1 ఔన్సు.

ఉపయోగములు:—కాస, శ్వాస, రక్తపిత్తము, కంఠరోగము, ఉరఃక్షతము ఇవి శమించును,

8. వాసాదికషాయము- బృహద్వాసాదికషాయము భైషజ్య - నేత్రరోగ. మాత్ర:—1 పలము,

ఉపయోగములు:—నేత్రములనుండి గలుగు రక్తస్రావము, తిమిరము, నేత్రకండు, పటలార్బుదము, సవ్రణశుక్రము, శుక్రము ఇవి శమించును.

9. వాసాదితైలము - బ - రా - వాతరోగ.

ఉపయోగములు:—వాతాద్యంజన రూపములగు సంప్రయోగించిన కలాపాతము, ఘంటావాతము ప్రశమించును.

10. సింహాస్యాదికషాయము - భైషజ్య - శోఫ. మాత్ర:-1 పలం.
ఉపయోగములు:—శోఫ శమించును.

(6) Actions and uses:—Expectorant antispasmodic, and alterative; the flowers and roots with ginger and Sitah are given in ague, rheumatism, consumption, asthma, caronic bronchitis and other chest affections. The root is a fair substitute for senega leaves are often smoked in Asthma.

R. N Khory II. p. 464.

"Strong testimony in favour of the remedial properties of the drug was furnished to the authors of the "Pharmacopia of India by Drs. Jacksonh and Dutt, who employed it with marked success in bronchitis, asthma and other pulmonary and catarrhal affections. Cases illustrative of its affects in catarrhl, bronchtis and phthisis have been published by Mr. O. C. Dutt.

(Indian annals of Med. Sci. 1865 Vol.X p. 156).

In Bengal the leaves are smoked in asthma; good evidence of their value when thus used has been collected by Dr. G. Watt in the "Dictionary of the Economic products of India" Dr. Watt has also brought to notice the use of Adhatoda leaves in rice cultivation in Sutlejvalley. The fresh leaves are scattered over recently flooded fields propared for the rice crop, and the native cultivators say that they not only act as a manure but also as a poison to kill the equatic weads that otherwise would injure the rice. Experiments conducted by us show that the infusion acts upon the cells of those plants in the same manner as certain chemical re-agents by contracting their contents and causing their disintegration it also proves poisonons to any animalcules, frogs, leeches, etc, present in the water; on the higher animals the leaves do not have this affect".

(Pharmacogrophia Indica Dymock II p. 54).

## స్వానుభవము

దగ్గులలో సామాన్యముగా దీని నుపయోగింతురు. కషాయముగా కాచిగాని, పానకముగా చేసికాని, లేహ్యముగా చేసికాని, కరక్కాయ, పిప్పలి, శుంఠి, చక్కెర, తేనె మొదలగు వానిలో కలిపికాని పుప్పుస వ్యాధులన్నిటిలో నుపయోగింపవచ్చును. పాండు, రక్తపిత్త వ్యాధులలో ఇది నమ్మకముగా పనిచేయును. జ్వరములకిచ్చెడి కషాయములన్నిటిలోను, ముఖ్యముగా కఫపిత్తములధికముగ నున్నపుడు, దీనిని చేర్చి వాడుదురు. కఫమురాక, పిల్లలు ఉక్కిరిబిక్కిరి అగుచున్నపుడు దీని స్వరసమునిచ్చిన కఫమును సులభముగ వెడలునట్లు చేయును. శ్వాస, కాస వ్యాధులలో మిక్కిలి తీవ్రముగా నున్నపుడు, దీని స్వరసము నుపయోగించి తరువాత ఇది కలిసిన మందుల నుపయోగించవలెను. కఫము చిక్కగాను తీగెలు తీగెలుగానున్న సమయములందు దానిని కరుగచేసి ఇపికాక్వానా (Ipecacuaneha)మాదిరిగా చులకనగా వెడలింపచేసి దగ్గును తగ్గించును. దీని ఆకులను శ్వాసయందు సిగరెట్టు త్రాగినట్టుల త్రాగుదురు.

$\frac{1}{4}$ మొదలు $\frac{1}{2}$ ఔన్సు స్వరసమును తేనెతో నియ్యవచ్చును. వాంతి కావలెనన్నచో, ఇంకను అధికముగ నివ్వవచ్చును. లేక దీని ఆకునుగాని, వేరుపట్టనుగాని, కషాయముగాకాచి $\frac{1}{2}$ మొదలు 2 ఔన్సులవరకు తేనెతో కలిపిగాని లేక తేనె కలుపకుండాగాని ఇవ్వవచ్చును. (ఆ. ల.)

# 19

# ఆమ్రః — మామిడి చెట్టు (క)

## భాషాంతర నామములు

హిందీ—అంబ, ఆమ; ఆమకా, మరాఠి—అంబా, గుజరాతి—కేరీ, ఆంబో, మళయాళం—మావు, కర్ణాటకం—మావు, ద్రావిడం—మా.

## నైసర్గిక స్వరూప వర్ణనము

## Natural Order - Anacardiaceae

### మామిడి కుటుంబము

### మామిడి—Mangifera Indika

ఈ కుటుంబమునందు మామిడి, జీడిమామిడి, చారమామిడి, నల్లజీడిచెట్టు, కాకరశింగుచెట్టు, బద్దిచెట్టు, ఇవురుమామిడి యీ మొదలగునవి చేరి యున్నవి.

ఆకులు:—ఒంటరిచేరిక. లఘుపత్రములు. కణుపు పుచ్ఛములు లేవు. బల్లెపాకారము. కొన్ని సమగోళాకారము. కొన్ని అండాకారముగగూడ గలవు. బిరుసుగాను, నున్నగాను నుండును. సమాంచలము. కొనసన్నము. కొన్నిటిలో గుండ్రముగను గొన్నిటియందు వాళమును గలదు.

పుష్పమంజరి;—కొమ్మల చివరనుండి రెమ్మగెలలు. పువ్వులు చిన్నవి. కొంచెము పచ్చగను కొంచెము ఎఱుపురంగుగను నుండును. మిధునపుష్పములును, ఏకలింగపుష్పములును గలవు.

పుష్పకోశము:—రక్షకపత్రములు 5. విడివి. చాకపాకారము. సీచము.

దళవలయము:—అయిదు ఆకర్షణపత్రములు. బల్లెపాకారము. రక్షక పత్రములకంటె రెట్టింపు పొడుగుండును. దీనిమీద పెట్టని చారలుగలవు.

కింజల్కములు:—అయిదు. ఒకపళ్లెరముమీద నున్నవి. వీనిలో నొకటి యెక్కువ పొడుగుగనున్నది. దీనికే పుప్పొడి తిత్తిగలదు. మిగిలినవి గొడ్డు కింజల్కములు.

అండకోశము:—అండాశయము ఉచ్ఛము. ఒకగది. కీలము ఒకటి. ఇది అండాశయముయొక్క యొకప్రక్కనుండి వచ్చుచున్నది. కీలాగ్రము కొంచెము వంగియుండును. ఫలములో పెంకుకాయ.

పురుషపుష్పము:—ఇందు అండకోశములేదు. ఉన్నను గొడ్డయి యున్నది.

ఈ కుటుంబపు చెట్లయందు గొంచెము జిగురుగా నుండు రసముగలదు. ఆకులు ఒంటరిచేరిక. కణుపుపుచ్ఛములుండవు. సాధారణముగ నన్నియు లఘుపత్రములు. ఇవి బిరుసుగానుండును. పువ్వులు చిన్నవి. సరాళము. ఏకలింగ పుష్పములు మిదున పుష్పములు గలవు. అండాశయము చుట్టును గ్రంధికణములుగల పళ్లెరముగలదు. దీనిచుట్టును ఆకర్షణ పత్రములన్ని కింజల్కములుండును. ఫలము సాధారణముగ లోపెంకుకాయ.

మామిడిపండు మధురరసమును, కషాయానురసమును, స్నిగ్ధగురుగుణము లను, శీతవీర్యమును గలిగియుండును. వెంటనే శుక్రమును గలిగించును. బలమును, సౌఖ్యమును గలిగించును. హృదయమునకు హితమైనది. వర్ణమును గలిగించును. జాఠరాగ్నిని, కఫమును, కొద్దిగ పిత్తమును వృద్ధిపొందించును. వాతమును శమింపజేయును.

## ఆమ్రి - వృక్షసంపక్వ ఫలగుణములు

శ్లో॥ తదేవ వృక్షసంపక్వా గురువాతహరం పరం।
మధురామ్లరసం కించిద్భవేత్పిత్తప్రకోపనం॥

చెట్టునపండిన మామిడిపండు మధురరసమును, అమ్లానురసమును, గురుగుణమును గలిగియుండును. కొద్దిగ పిత్తమును ప్రకోపింపజేయును. విశేషముగ వాతమును శమింపజేయును.

## ఆమ్రి - కృత్రిమ పక్వఫలగుణములు

శ్లో॥ ఆమ్రా కృత్రిమపక్వాచ తద్భవేత్పిత్త నాశనం।
రసస్యామ్లస్య హీనస్తు మాధుర్యాచ్చ విశేషతః॥
ఉషితం తత్పరం రుచ్యం బల్యం వీర్యకరం లఘు।
శీతలం శీఘ్రపాకిస్యా ద్వాతపిత్తహరం సరం॥

కృత్రిమముగ పండించిన (కావువేసి పండించిన) మామిడిపండు విశేషముగ మధురరసము గలిగియుండుటచేతను, అమ్లరసము లేకపోవుటచేతను పిత్తమును శమింపజేయును. దీనిని కొలదికాలము నిలువయుంచినచో, సరి లఘుసరిగుణములను, శీతవీర్యమును గలిగియుండును. మిగుల రుచిని బుట్టించును. బలమును, వీర్యమును గలిగించును. శీఘ్రముగ జీర్ణమగును. వాతపిత్తములను శమింపజేయును.

## ఆమ్రి - కృత్రిమ పక్వఫలరసగుణములు

శ్లో॥ తద్రసో గాలితో బల్యః గురుర్వాతహరః సరః।
అహృద్యస్తర్పణోఽతీవ బృంహణః కఫవర్ధనః॥

కృత్రిమముగ పండించిన మామిడిపండుయొక్క రసము (వస్త్రపూతము) గురుసరగుణములను గలిగియుండును. బలమును, తృప్తిని గలిగించును. మిగుల బృంహణము. కొద్దిగ హృదయమునకు హితమైనది. కఫమును వృద్ధిపొందించును. వాతమును శమింపజేయును.

## ఆమ్ర - కృత్రిమ పక్వఫలఖండ గుణములు

శ్లో॥ తస్యఖండం గురు పరం రోచనం చిరపాకిచ।
మధురం బృంహణం బల్యం శీతలం వాతనాశనం॥

కృత్రిమముగ పండించిన మామిడిపండుముక్క మధురరసమును, గురుగుణమును, శీతవీర్యమును గలిగియుండును. అధికముగ రుచిని బుట్టించును. చాలా కాలమునకు జీర్ణమగును. బృంహణము, బలమును గలిగించును. వాతమును శమింపజేయును.

## ఆమ్ర బీజ గుణములు

శ్లో॥ ఆమ్రబీజం కషాయస్యా చ్ఛర్ద్యతీసార నాశనం।
ఈషదమ్లం చ మధురం తథాహృదయ దాహనుత్॥

మామిడి జీడి కషాయరసమును, కొద్దిగ అమ్ల మధురానురసములను గలిగియుండును. ఛర్ది, అతీసారము, హృదయదాహము అను నీ వ్యాధులను బోగొట్టును.

## ఆమ్ర పల్లవ గుణములు

శ్లో॥ ఆమ్రస్య పల్లవోరుచ్యః కఫపిత్త వినాశనః॥
మామిడిచిగురు రుచిని బుట్టించును. కఫపిత్తములను శమింపజేయును.

## ఆమ్ర పుష్ప గుణములు

శ్లో॥ ఆమ్ర పుష్ప మతీసార కఫ పిత్త ప్రమేహనుత్।
అసృగ్దుష్టిహరం శీతం రుచికృద్గ్రాహివాతలం॥

మామిడిపువ్వు శీతవీర్యమును గలిగి యుండును. రుచిని బుట్టించును. మలాదులను నిరోధించును. వాతమును వృద్ధి పొందించును. కఫపిత్తములను శమింపజేయును. అతీసారము, ప్రమేహము, రక్తదోషము అను నీ వ్యాధులను బోగొట్టును.

## రాజామ్రః - రాచమామిడిచెట్టు (ఖ)

శ్లో॥ రాజామ్రష్టంక ఆమ్రాతః కామాహ్వో రాజపుత్రికః।

రాజామ్రము, టంకము, ఆమ్రాతము, కామాహ్వా, రాజపుత్రికయనునవి రాజామ్రనామములు.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B170 |
| పుస్తకం పేరు | ఆంధ్ర ఋగ్వేద శిక్ష - [illegible] |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 127 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | REHANA |
| స్కాన్ చేసినది | Mounica |
| పరీక్ష చేసినది | SANDHYA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |